# న వ యు గ ము

## (సాంఘిక నాటకము)

రచన:

"కవితా విశారద" "మధురకవి"

వన్నెకూటి బాలసుందరం

ప్రచురణ:

జాతీయ రచనామండలి,

పీరవల్లి.

1950



[వెల: రూపాయిపావలా



గ్రంథకర్త:

"కవితావిశారద, మధురకవి"

వన్నెకూటి బాలసుందరం

# అభిప్రాయము

ఎ. జోసెఫ్ గారు

అఖిల భారత శాసనసభా సభ్యులు (ఢిల్లీ)

శ్రీ వన్నెకూటి బాలసుందరంగారు రచియించిన "నవయుగ" మను నాటకమును చదివి వినిపించిరి. ఇందలి ఘట్టములలో ప్రదర్శించిన కవితా కౌశల్యము ఎన్నదగినది. పద్యధోరణిలో యిమిడ్చిన భావములు పేదల ప్రతినిధుల నొకసారి దుఃఖమునకులాగును. మరియొకతూరి పేదల పురోభివృద్ధిచూచి ముదమొప్పారచేయును. కులతత్త్వనిర్మూలన, యువకుల కార్యసాధనయేనని రుజువుచేసినది. ఇందు చిత్రించిన పద్య, గద్య, గేయాదులు జాతీయ భావపూరితమై, సాంఘికమార్పుల కాలవాలమై - గాంధిజీ సూక్తుల నుగ్గడించుచు-సంఘ, జాతి, దేశ, సేవలకు బహుగా తోడ్పడు గ్రంథరాజమై యొప్పారుచున్నది. ఇట్టి సద్గ్రంథమును రచించి దేశసేవకు తోడ్పడిన బాలసుందరంగారిని అభినందించుచున్నాను.

(Sd) ఎ. జోసెఫ్.

# శ్రోతల అభిప్రాయాలు

"నటకావతంస" స్థానం నరసింహారావుగారు.

ఆంధ్రనాట్య కళాపరిషత్ అధ్యక్షులు - తెనాలి

"నవయుగం" అనే యీ నాటకాన్ని ఆమూలాగ్రంగా కవిగారే వినిపించారు నాకు. వీరి నిరాడంబర జీవితోన్నత ఆశయాలు - వీరి నిమ్న జాత్యోద్ధరణావసర సంస్కారము-వర్ణాంతర వివాహ సామరస్య సిద్ధాంతము మొదలగు నవయుగ వన్నెవెలుగులన్నీ వీరి శ్రావ్య కవితాఝరీ తరంగ తళతళలై ఆంధ్ర విజ్ఞాన సంస్కారక్షేత్రాన ప్రవహించిననాడు మన ఆంధ్రజాతి ఆదర్శ ఫలోన్ముఖము కాగలదని నమ్ముతున్నాను.

నాబుద్ధికి ఈ కవి రసజ్ఞుడు - సరసుడు - ఉదారుడు - త్యాగశీలుడు- నటుడు వీటన్నిటనీ మించిన మంచినేర్పు - ఓర్పులు - గల దర్శకుడుగా తోస్తూన్నాడు. ఈయన సహకారమొందగలిగిన నటులు యీ నాటకమును ప్రదర్శించుటలో మంచికీర్తి నార్జించగలరని కూడా నమ్ముతున్నాను. మున్ముందు యీ కవి తన ఉత్తమ రచనలచే దేశసేవచేసి - దేశభక్తులు పొందిన ముక్తిని పొందుగాత.

(Sd) స్థానం

డైరెక్టరు జంపన చంద్రశేఖరరావుగారు, M. A. B. ED—మద్రాసు

"నవయుగం" విన్నాను. యదార్థానికి యుగానికి 'నవ' 'పురా' అని లేకపోయినా కవులు 'నవయుగం' 'పురాతనయుగం' అని ప్రయోగిస్తూన్నారు కారణం - యుగం అనుదానిని కొంత కాలపరిమాణంగా చూచుకుంటే కాలాన్నిపట్టి కవికలం ప్రజాజీవనాన్ని చిత్రిస్తూ ఉంటుంది, కాబట్టి యుగాని యుగానికి భేదం చూపేందుకు 'నవ' 'పురా' అని ఉపయోగిస్తున్నారు. అని అనుకుంటే వీరి 'శీర్షిక' ఉత్తమంగా ఉంది.

గాంధీయుగం ఈ యుగం; తద్భావ గ్రథితం ఈ గ్రంధం - బాల సుందరంగారి భావవైశాల్యం—సర్వమానవ సౌభ్రాతృత్వం-సౌజన్యత్వం - సౌమనస్యత్వం - ఇందు అంతర్వాహినిగా వ్యాఖ్యానింపబడ్డాయి - పాత్ర పోషణ రసవత్తరంగా ఉంది. కులీను లనుకొన్నవారు నీచకులజులుగా కొందరిని అధః పతితులను చేయడం - ధనికులు దరిద్రుల నెత్తురోడ్చిపీల్చే దౌష్ట్యం చక్కగా ప్రదర్శింపబడ్డాయి. అటువంటి దురభిప్రాయాలను-సంకుచిత భావాలను - నిర్మూలించ ఈ కవి తన కలానికి పదును పెట్టు కొన్నాడు.

ఇట్టి సాంఘిక రచనలే దేశాన్ని ముందడుగు వేయిస్తాయ్, ఇటువంటి రచనలే ఈ కవినుండి నేను కాంక్షిస్తున్నాను.

సర్వేజనాః సుఖినో భవన్తు

(Sd) జంపన

యల్. బుల్లయ్యగారు. B. A (Hons.)

డిస్ట్రిక్టు యెడ్యుకేషనల్ ఆఫీసరు కృష్ణా. (బందరు )

"నవయుగ" మను నాటకమును చదివితిని. దీని యందలి పద్యములు-సంభాషణలు - సమయోచితము గా నుపయోగింప బడినవి. ఈ నాటకమందలి కథ సంఘమును ఏకము చేయుటకు ప్రయత్నించుచున్నది. సంఘసేవ ద్వారా దేశసేవ యెంతో జరుగును. ఇటువంటి నాటకములు మన సంఘమున కెంతయు అవసరము. గ్రంధకర్తను నేను అభినందించు చున్నాను.

(Sd.) యల్. బుల్లయ్య

సా. శా. పేములుగారు. B. A.

డిస్ట్రిక్టు హరిజన వెల్ ఫెర్ ఆఫీసరు. పశ్చిమగోదావరి జిల్లా (ఏలూరు)

నవయుగం, ప్రస్తుత భారత జనానీకాన్ని ఆవరించియున్న బ్రహ్మాండ సమస్యయగు జాత్యైక్యతకు ఎంతేని ఉపకరించే జాతీయ నాటకం. గ్రామములలోని హరిజనుల దైనందిన జీవితము - వారికి సవర్ణుల వలన కలిగే యిక్కట్టులు - కన్నులకు కట్టినట్లు చక్కగా చిత్రింప బడినవి. భారతదేశంలో ఒకేజాతి

"భారతజాతి" గా వుండాలని - హరిజనులలోని పలుశాఖా విభేదములు నశిం చాలని - హరిజన యువతీ యువకులు ఉన్నత విద్య నభ్యసించుట ఎంతేని ఆవశ్యకమనియు - విద్యావంతులు ఉద్యోగముల కొరకేగాక, సంఘసేవ చేయుట అత్యంత అవసర మనియు - ఈ నాటకంద్వారా ఈ కవిగారు ప్రచు పరచినారు. సదవకాశములు వున్నయెడల హరిజను డితరులకే రంగము లోను తీసిపోడని ఇందు వ్యక్తీకరింప బడినది ఈ నాటకము నందలి సంభాష ణలు - పద్యములు అన్నియు సమయోచితముగాను - హృదు మధురముగాను రచింపబడినవి. గ్రంధకర్త "కవితావిశారద" "మధురకవి" బిరుదులొందిన కవియేగాక - హరిదాసు - నటుడు - గాయకుడు - దర్శకుడు కూడాను. వీరికిందుగల అనుభవమే వీరినీ గ్రంధమందలి పాత్రపోషణ - సంభాషణల శక్తి - పద్యలాలిత్యము - రంగ విభజనలయందు ప్రేక్షకుల హృదయా కర్షణకు అను వగురీతి నిట్టురచియింప జేసినది. ఈ కవియింకను యిట్టివే పెక్కు గ్రంధములు రచించి పాఠకులయొక్కయు - ప్రేక్షకుల యొక్కయు-మన్న నలకు ప్రాతులగుదురు గాక.

(Sd) సాకా వేములు.

బండారు ప్రేమానందముగారు. B. A. B. ED.

డిప్యూటి ఇనస్పెక్టర్, ఆఫ్ స్కూల్సు. కైకలూరు రేంజి.

శ్రీ వన్నెకూటి. బాలసుందర కవిగారి "నవయుగ"మను నాటకమును ఆమూలా గ్రముగ విన్నాను. కథావస్తువు ప్రస్తుత భారతావనిలోని అన్ని వర్గాల వారిని ఆవరించి యున్న జాత్యైక్యత కవిగారి కలములో వినూత్నజాతీయ భావాలు చిందులు త్రొక్కుచున్నవి, "భారతక్రైస్తవులలో జాతీయతలేదు" అను దుష్ప్రచారమును యీనాటకము పటాపంచలు చేయగలదు. రసవంతములగు ఘట్టములు - సన్నివేశములు - సంభాషణలు - యిందు పెక్కులు గలవు. ఈయన కవిత్వము రసవంతముగను - పాత్రపోషణ, పాత్రౌ చిత్యాది లక్షణ లక్షితముగ ఉన్నయది. ఈయన కవి - గాయకుడు - నటుడు - దర్శకుడు -

ఇవన్నియు ఒక్కటిలో నుండుట మిక్కిలి అరుదు. గ్రామీణులకు అనుగుణ్యముగా జానపదుల జీవితమిందు చిత్రింపబడినప్పటికిని - సందర్భానుసారముగ దీర్ఘసమాస సహితమగు పద్యములు-వాక్యములు - గుప్పించి, కవిగారు తమ పాండితీ పటిమను వెల్లడించి యున్నారు. ఇట్టి రచనలు అనేకము లింకను వీరు వెలువరించి - ప్రజా సేవ - దేశ సేవ - జాతి సేవ - చేయుదురని నా యాశ.

(ds) బండారు ప్రేమానందము.

బి. డి. యస్. విల్లియంగారు. B A. L. T.

డిప్యూటీ ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సు గన్నవరంరేంజి. శ్రీ వన్నెకూటి బాలసుందరంగారు నాకు చిరపరిచితులు. ఈయన చిన్ననాటినుండియు ఉన్నత భావములతో - నూతనాభిలాషలతో - ఉప్పొంగుచు రచనలందు నటనాభినయమునందు - దర్శకత్వమునందు - సంగీతమునందు - మంచి సన్నివేశము కలవాడు. ఆర్థిక దుస్థితివల్ల ఈయన రచించిన పద్యగ్రంథము లింకను అచ్చువేయ బడకుండుట మిక్కిలి శోచనీయము. ఈయన రచించిన "నవయుగ" మను నాటకమును ఆ మూలాగ్రముగా విని యున్నాను. ఈ నాటకము మిక్కిలివ్రుదు మధురమైన శైలితోను - రసవంతములగు ఘట్టములు - సన్నివేశములు - సంభాషణలతోనిండి - పిన్న పెద్దలకు - పాఠకులకు - ప్రతివారికిని మనోరంజకము గలుగునట్లున్నది.

ప్రస్తుత క్లిష్ట పరిస్థితులలో దేశాభ్యుదయము కావలెనన్న - ముఖ్యముగా కావలసినది జాత్యైక్యత దీనిలోంతవల్లనే మానవులందు - దేశములందు మిక్కిలి భేదాభిప్రాయములు - ద్వేషములు - కలుగుచున్నవి. హరిజనులలో కూడా వర్గ భేదములు - కుడి ఎడమలు - పాటింప బడుచున్నట్లు చూచుట మిక్కిలి విచారకరము. ఇట్టి కళంకమును పోగొట్టుటకును - భారత జాతీయ ఐక్యతను పెంపొందించుటకును_ఆధునిక జాతీయభావములు వ్యాపింపచేయుటకును - మిక్కిలి ఉపయోగకరముగనున్న ఈ "నవయుగ" నాటకమును రచించిన బాలసుందరముగారిని అభినందించుచున్నాను. ఈ కవి యిట్టివే

పెక్కు గ్రంధములు రచించి_ప్రజాసేవ _ జాతీయసేవ_దేశసేవ _ చేయుదురని ఆశించుచున్నాను. (Sd) బి. డి. యస్. విల్లియం

గోపు శౌరిరెడ్డిగారు. B. A L. L B. హైకోర్టువకీలు
(Ag.) ఎడిటర్ భారతమిత్రము. (గుంటూరు)

"నవయుగ" మను నాటకమొక సాంఘిక నాటకము. ప్రస్తుత భారతావనియందు మహోత్తరమైన సేవలలో నిది ప్రాముఖ్యతను జెందినసేవ జాతీయ. సమైక్యతను పెంపొందించు ఇటివంటి నాటకములద్వారా కుల మూఢత్వము వలన క్రుళ్ళి నశించు జనాంగమునందు నవయుగమును దే గలుగు ఇటువంటి గ్రంధకర్తలు - నాయకులు_సంస్కర్తలు_మనయందు బహుకొలది, ఆకొలది మందికున్న ఆర్ధిక దిగ్బంధనమెందు అయినను అన్నిటిని త్రెంచుకొని తనయందుప్పొంగు ఉత్సాహమును అందరికను వగు భాషలో-కమ్మని పదములతో - తియ్యనిభావాలతో _ ఉల్లేఖించగలిగిన ఈ మధుర కవిగారు అందరి యాదరణకు అర్హులు. వీరురచించిన యీగ్రంధమేగాక వీరి ప్రధమనాటకము బెజవాడ మేతాణుల వారనుమతించిన "జ్ఞానసుందరి" నాటకమునుగూడ జూచి ఇట్టివారి గ్రంధముల బోషింప _ ప్రచురింప _ మన సంఘమందు తగునిధి లేనికొలత కడుంగడు శోచనీయము, మనయందున్న శక్తులను మనమేగాన లేకున్నాము. ఈ గ్రంధ _ కావ్య _ రచనా శక్తులను సమీకరింప మార్గము లేదా? యను ధర్మకాంక్ష పొడముచున్నది ప్రధమమున గ్రంధపోషణయందు మన యాదరణముఖ్యము కాన సంఘరీత్యానేమి _ గ్రంధపోషణరీత్యానేమి _ జాతీయైక్యతారీత్యానేమి _ కావ్యాభిరుచిరీత్యానేమి _ ఈ "నవయుగ" నాటకము మనమెల్లరమాదరించి _ ప్రదర్శించి _ ఫలింపజేయుట మనయెల్లర ప్రధమ విధియని నాభావము. గద్య _ పద్య _ రచనల విషయమైన పాఠకులకీ గ్రంధకర్త అపరిచితుడుకాడు. సకల రసములను సమిష్టిగా పోషించగలిగిన కవిగారి నాటకఫలితము మనసంఘపరివర్తనమేనని అభిలషించు చున్నాను,

(Sd) జి. యస్. రెడ్డి

# గ్రంథపోషకులు

| | | |
|---|---|---|
| బూసి. భక్తి నాదంగారు. చినగొల్లపాలెం. | ... | రు 20_0_0 |
| చలసాని శ్రీనివాసరావు చౌదరిగారు. వెంట్రప్రగడ | ... | 20_0_0 |
| మేరుగు సముద్రుడుగారు గుడివాడ | ... | 15_0_0 |
| వానపాముల సంఘమువారు | ... | |
| దాసరి. అబ్రహాము గారు. | ... | 10_0_0 |
| గొంతుపులి. శరాబంచిరాజుగారు. గురజ | ... | 10_0_0 |
| బుగ్గా. మనోహరము గారు. ast) కరణం. పాలకొల్లు | ... | 10_0_0 |
| జోనా & జోసెఫ్ బ్రదర్సు. నర్సాపురం | ... | 10_0-0 |
| సాకా. ఫేములుగారు D. L. O. పశ్చిమగోదావరిజిల్లా | ... | 10_0_0 |
| నక్కా. చినవెంకయ్యగారు. ఏలూరు. | ... | 10_0_0 |
| జి. చినకనకయ్య చౌదరిగారు. ఏలూరు. | ... | 10_0_0 |
| మద్దాల. డేవిడ్ గారు గొలివేపల్లి. | ... | 10_0-0 |
| కూచిపూడి వీరరాజు చౌదరిగారు వెంట్రప్రగడ | ... | 10_0_0 |
| హిం॥ ఎలి. స్కూలుస్టాఫ్ శివపురం | ... | 5_0-0 |
| శ్రీ వందనముగారు (పోష్టుమాష్టరు, వానపాముల | ... | 5_0_0 |
| B. B. స్కూలు స్టాఫ్ వెంట్రప్రగడ | ... | 5_0-0 |
| యెద్దు ప్రకాశంగారు. పెదపాడు | ... | 5_0_0 |
| దాసి. జ్ఞాన్నేసుగారు, బొమ్మినంపాడు | ... | 5_0_0 |
| తుల్లి మెల్లి ప్రసాదరావుగారు ఏలూరు. | ... | 5_0_0 |
| మేరుగు. నాగభూషణంగారు. ఏలూరు. | ... | 5_0_0 |
| పెరుమాళ్లపల్లి. నోవహుగారు. చిరివాడ. | ... | 5_0_0 |
| వి. సుబ్బరాజుగారు (Hd.) కరణం. పాలకొల్లు. | ... | 5-0_0 |
| వి. యస్. డేవిడ్ గారు పాలకొల్లు. | ... | 5_0_0 |
| వి. మనోహరము గారు నరసాపురము. | ... | 5_0_0 |

| | | |
|---|---|---|
| మిషన్ మిడిల్ స్కూల్ స్టాఫ్ నరసాపురము | ... | 5-0-0 |
| బండ్లమూడి సత్యవేదముగారు. ఏలూరు. | ... | 5-0-0 |
| యస్. జ్ఞానానందముగారు, D. G. గన్నవరము. | ... | 6-0-0 |
| ఎ. ఫిలిఫ్ గారు. ఏలూరు. | ... | 5-0-0 |
| టి యస్. కృపాదానంగారు సబ్ మేజస్ట్రేటు ఏలూరు | ... | రు 5-0-0 |
| కోయ వెంకటేశ్వరరావుగారు. వీరవల్లి | ... | 5-0-0 |
| పెండుర్తి తోమస్ గారు. ఏలూరు | ... | 5-0-0 |
| బండా కనకలింగేశ్వరరావుగారు. B. A. L. L. B ఏలూరు. | | 5-0-0 |
| బి. భాస్కరరావుగారు. శ్రీనివాససినిమా మేనేజరు గుడివాడ | ... | 5-0-0 |
| జి. జె. రామకృష్ణారావుగారు. గన్నవరం | ... | 5-0-0 |
| జంగం భుజంగరావుగారు. అమ్మపాలెం | ... | 5-0-0 |
| కె. ఫ్రాంచిస్ గారు. D. C. గుడివాడ | ... | 5 0-0 |
| B. G. స్కూలు స్టాఫ్ వెంట్రప్రగడ | ... | 5-0-0 |
| పాలపర్తి మార్కుగారు. పాలకొల్లు | ... | 4-0-0 |
| డి. జె. ప్రసాదంగారు. ఏలూరు. | ... | 4-0 0 |
| శ్రీ కృష్ణావతారంగారు. B. A. L. L. B ఏలూరు4 | ... | 4-0-0 |
| ఉచ్చుల దయాశాలిగారు. కొర్నిపాడు | ... | 3-0-0 |
| డా॥ గిడుగు వెంకటసీతాపతిగారు మద్రాసు | ... | 2-0-0 |
| మారపనేని బాపనయ్యగారు. గుడివాడ | ... | 2-0-0 |
| యార్లగడ్డ కుటుంబరావుగారు పెదపాడు | ... | 2-0-0 |
| పాత బాలసుందరంగారు. పెదపాడు | ... | 2-0-0 |
| పులవర్తి ఆశీర్వాదంగారు వెంట్రప్రగడ | ... | 2-0-0 |
| అప్పికట్ల మిషక్ గారు. వెంట్రప్రగడ | ... | 2-0-0 |
| కూచిభొట్ల పరశురామశాస్త్రిగారు పుల్లచెరువు | ... | 2-0-0 |

## ఒక్క మాట

పొరపాట్లు మానవసహజం కార్యసాధనలో తెలిసిన పొరపాట్లు కూడా కన్పించకపోడం మరింత సహజం సాంఘిక చిత్రి ప్రపచురణలో ప్రథముండనగు నా యీ గ్రంధ రచనలో తెలిసి – తెలియక చేసిన నా పొరపాట్లను మన్నించ బుధులను అర్ధిస్తున్నా.

## ఇంకొక్క మాట

ఇందుసూచించిన కధగాని – పాత్రల పేర్లుగాని – యెవరికీ సంబంధించినవిగాక కేవలం కల్పితమేనని ఇందుమూలంగా వివరిస్తున్నా.

## మరొక్క మాట

ఈ గ్రంధ ముద్రితానికి ధనసహాయం చేసిన కళాభిమానులకు – జాతిపురోగాములకు – మిత్రులకున్నూ – శ్రమకోర్చి నా యీ గ్రంధాన్ని పరిశీలించి అభిప్రాయాల నిచ్చిన శ్రోతలకున్నూ – నా కృతజ్ఞతాభివందనాలర్పిస్తూ వారికి పరమేశ్వరు డష్టైశ్వర్యాయు రారోగ్య సంపదలతో పుత్ర పౌత్ర పారంపర్యంగా బ్రోచుగాత యని పరమేశ్వరుని ప్రార్ధిస్తున్నా.

గ్రంధకర్త.

## సూచన

ఈ నాటకాన్ని లిఖిత పూర్వకమైన నాయనుమతి లేనిదే యెవ్వరూ యేవిధంగానూ ప్రదర్శింపరాదు.

గ్రంధకర్త.

# కృతి సమర్పణ

ఉ. శ్రీ పరమేశ్వరుం డఖిల శ్రేయముఁగోరియ మానవాకృతిన్
ఓపికతోడ యాతనల నోర్చుచు కూర్చుచు ముక్తిమార్గమున్
రూపము దాల్చుచున్ మమత రూఢి నొసర్చెను యేసునాథుఁడా
యాపరలోకనాథుఁడిల నాశ్రయ మిచ్చుత వందనార్యకున్.

ఉ. దాసరి వంశపావనుఁడు దానసుశీలుఁడు శాంతి గాముఁడున్
మీసము వంచని ప్రతిభ మేటి పరాక్రమ విక్రముండునై
భాసిలు ప్రేమనందముకు భాగ్యసురాశిగ జన్మ నొందె యీ
గాసిలు దీనమానవుల గావగ కంకణ ధారివో సఖా !
నీ సరి నీవె గాకొరుల నేరికి బోల్చగ మాదుశక్యమే.

గీ. కీర్తిశేషాన మీతల్లి మూర్తియయ్యె
ఆర్తజనమెల్ల హా ! యన అంతరించె
తల్లి ! ఆశ్రితావర కల్పవల్లి ! మాదు
అంజలిదె గొమ్మ ! మాయమ్మ ! అంజలమ్మ !

సీ. అచట గంగాయమున అమృత ప్రవాహ
మీ హితవాక్సుధా వాహినిచట
అచట దేశపుకోట అఖిల హిమవత్పంక్తి
మీసృష్టి వుపకార మిచటపంక్తి
అచట తాజమహాలు ఆనంద మయశోభ
మీకార్య నిర్మాణ మిచటశోభ

లాలు ఖిల్లాపైన మేలురంగులజెండ
ఇచట వ్యవసాయకూలీలజెండ
అఖిల భారత ప్రతిభవై అవతరించ
హరిజనుల కల్పతరువువై ఆదరించ
దేశమాతకు చిరునవ్వు తేజరిల్లె
వందనాన్మణి సద్వాణి వాద్రశేణి !

గీ. సన్నుతింపగ నాకిల సాధ్యమగునె ?
అమరగాంధికి నూలుపోగసెడు మాడ్కి
నవయుగంబను కృతిని నే సర్పణంబు
జేతు గైకొను హరిజన జీవదాత !



# న వ యు గ ము

## [సాంఘిక నాటకము]

### ఒకటో అంకం — మొదటిరంగము

(గగ్గయ్యగారి గృహపరిసర వుద్యానవనంలాంటి తోటలో పాఠశాల నుండి వచ్చి ఆడుకుంటూ వున్నశాంత.)

శాంత:—పాట

సిరులొలికించిందోయ్! మా
తెలుగుతోటనేడు॥ సిరు॥
పరదాస్యపు సంకెళ్లు త్రెంచుకొని
పలురంగులతో — పసిడి మేనుతో॥ సిరు॥
గోదావరి కృష్ణ కావేరులు
రాధాకృష్ణుల నాట్యముసేయగ
మోదామృతములో మునుగుచు — తేలుచు
ఆడుచు పాడుచు హాయి హాయిగా॥ సిరు॥

సీ. శ్రీయుతంబౌ కంఠ శ్రేయుంబుచే హాయి
హాయిగా గీతాల నాలపింప
కొమ్మకొమ్మకు దూకి రెమ్మరెమ్మకు పాకి
తుమ్మెద ఝుం ఝుమల్ నెమ్మలింప
సంధ్య కిరణాలతో వింధ్యగిరులందాగు
మందగిత సూర్యుని మహిమ బొగడ

పలురంగులీనుచు కులుకు మావి చిగురు
తళుకు బెళుకులనెల్ల తస్కరింప
వేగ రావోయి కోయిలా! త్యాగశీల!
జాయిగా కుహూ కుహూ యని హాయిగొల్ప
పాడగారావె! ఒకపాట పక్షిరాణి!
స్వాగతంబిదె కోయిల శారదాంబ!"

ప్రకాశం:— (తోటలోపనిచేస్తూ ఆకలివల్ల నీరసించిన దేహంతో శోషవచ్చి మూర్ఛపోతాడు)

శాంత:— (ఆతురతతో ప్రవేశించి జలము తెచ్చి మూర్ఛ తేరించి యేం ప్రకాశం? అలాపడిపోయావేం ?

ప్రకాశం:— శాంతమ్మ తల్లీ! దణ్ణం ... నన్నంటుకుని లెగ తీసి నందుకు మీనాన్నగారు సూత్తే నిన్నుకూడా సంపెత్తారు. దూరంగా వుండమ్మా!

శాంత:— పర్వాలేదులే చెప్పు! యెందుకలా పడిపోయావ్ ? కాలుకు యెదురుదెబ్బ తగిలిందా ?

ప్రకాశం:— కాదమ్మా! ... కాలుకు యెదురుదెబ్బ కాదు. కడుపుకు ఆకలిదెబ్బ ... పాణానికి గేరుదెబ్బ ... మాఅయ్య మూడు రోజుల్నుండి మంట జొరంతో మూలుగు తుండాడు. పనికెల్లలేదని మీనాన బత్తెం నూకలు బిగ

బట్టాకు మాఅమ్మ – అయ్య – శెల్లిలు – యీ మూడు రోజులున్నుండి గంజి తాగలేదు.

శాంత:— అవును...“అహింసో పరమోధర్మః” అని మాట వరుసకు మాత్రమంటారు. ఇలాగేనా అహింసా సిద్ధాంతాన్ని అమలుజరిపి–మహాత్ముని ఆత్మకు శాంతిచేకూర్చేది! ఇదేనా హరిజనోద్ధరణ? ఇట్లేనా ఆర్తరక్షణ? ...పూజలు–పునస్కారాలు–పుణ్యక్షేత్రాలు–పున్నామనరకాలు – అని అమాయక ప్రజల్ని మోసగించిడానికేనా యీపూజలన్నీ! ప్రత్యక్షమున వున్నా పరమాత్మ స్వరూపులైన యీ అమాయక–అసహాయక – హరిజన ప్రజల్ని ఆదరించని కసాయి హృదయుల కెందుకయ్యా హరిసేవ? ఈ జాతి కుల విభేదాలకూల ద్రోసి ఈ మతోన్మాదాల మారణ హోమన్లోమాడ్చి – మసిచేయని మానవసేవ – మాతృదేశారాధన – స్వాతంత్ర సౌఖ్యము చేకూరుస్తుందా!

సీ. జాతి మతభేదాల జపముసేయుటగాదె
భరతఖండము రెండు బ్రద్దలయ్యె
అంటు జాడ్యంబిట్టు లావహించుటగాదె
హిందూమతపు తాలిబొందునలిగె
పక్షద్వయంబను కక్ష బూనుటగాదె
గాసిజెందెను మన బోసుబాబు

"హరిజన బాలికే అధక్షు" యను గాంధి
కోర్కెకుల మనిగాదె కూలిపోయె
మతమహమ్మరి యావేశ మతివికలత
భారతాంబకు స్వాతంత్ర్య భాగ్యదాత
గాంధితాతను జంపె నాగాడ్సె పాపి
జాతికుల మత ద్వేషాల జంపకున్న
లేదు స్వాతంత్ర్య సౌఖ్యంబు లేశమైన ॥

అయ్యో ! ఆవేశన్లో కర్తవ్యాన్ని మరచాను (లోనికి పరుగిడి అన్నంతపేళా తెచ్చి అన్నాన్ని ప్రకాశం చెంగులో మూటకడ్తుంది)

గర్గయ్య:— (ప్రవేశిస్తూ అదృశ్యాన్ని చూచి) ఆఁ ? ఆఁ ? ఆదేవిటే ? ... ఓసి బడవాముండ ! కొంపంతా వాడికి కట్టిపెడ్తున్నావా ? (శాంతనుకొడ్తూ) ఇలాంటి పని యింకెప్పుడైనా చేస్తావా ? ... చేస్తావా ? ? చెప్పు ! ! (శాంతను లోనికి పడద్రోసి ... యేరా ! ! ... మాలగాడిద కొడక ! ఆనోటి పాలారని పిల్లకి కాటికేసి – ఇంట్లో సరుకులన్నీ కంట్లో కనుమాయచేస్తావా ? (మూటకట్టిన అన్నాన్ని చిమ్మిపారవేసి—కొడ్తూ) ఇంకనీజన్మలో నాగుమ్మంతొక్కావా ? డొక్కచింపి డోలుకట్టిస్తా జాగ్రత్త ! (వెళ్లాడు)

ప్రకాశం:— అమ్మా ! ... అమ్మా ! ... (మూలుగుతూ లేచి) తన్నులగిల్నా – అన్నమన్నా దక్కుద్దనుకున్నా ...

కొమ్మకొక మెతుకయ్యే తట్టుచిమ్మేశాడు. (చెదరిపోయిన అన్నాన్ని ప్రోగుచేసుకుని మూటకట్టుకుని వెళ్తాడు)

(తెరపడ్తుంది)

## రెండవ రంగం

(గంగన్న-మంగన్న-రంగన్న-కబ్బడు-ఇబ్బడు - మాణిక్యము-వగైరా కూలీలు గగ్గయ్యగారి పొలంలో తవ్వపనిచేస్తుంటారు? గగ్గయ్యగారియింటి నౌఖరు దాదాసాహెబు చేయిస్తుంటాడు)

కూలీలు :_ పాట

పొద్దోతుందోయ్ ! పడుసుకుఱ్ఱోడా !
యెద్దాలె తవ్వపతి మొకురు జూసెరా !
సద్ది బువ్వలు తాగి
కొద్ది సొంగలు లాగి
ఇద్దరిద్దరే మూగి
బుద్ది బలముతో సాగి ॥
నాసక్కని బావ ! ఇంకొక్కమాటరా
నాపక్కనేజేరి నాతో_చెక్కిలింత లాడరారా !
తోణికి వెయ్యరా ! నాతో
గునుకు లెయ్యరా ! ॥పొద్దోతుందోయ్॥

దాదాసాహెబ్:—అరే ! గంగడ్ !! మాస్కీ హోంస్తా హుండా డ్ జే ! పనీ మాలశార్మె శెయ్యండోయ్ !!

గంగన్న:— పొద్దాక జే! జే! అంటావ్ నోరుకుదురుగా రాదేం టియ్యా!

దాదా:— అరే?... హేమ్రివోయ్!... మాకీ హల్యాటూ మాటాసెప్తే ఘట్టీ షట్టూ పడ్తావ్ ? హోస్కీ తోటీ ఘుడ్డీ కోడ్కా హాస్పించూకుంటావ్ నీకీ ఘుడ్డీకీ ఫుట్టావ్ రే? మళ్లీమాటాసేస్తే మాదర్చోద్!! హంటాడ్, మదర్ హంటే హేట్మో? చూత్ హంటే హేట్మో? నీకీ క్యా మాలుంరె?

మంగన్న:— అయితే మాదర్సోదంటే తప్పుమాటేనా సాయిబు గారూ?

దాదా:— అరె పఁయ్యాఁ !!! ఘాస్కీ హింగ్లీస్ వుర్దూమెకల్సి తిట్టూబే !

గంగన్న:— అట్టాజెప్పు! సదువులేని మాలముండాకొడుకులమని యేగాడిదిపడితే ఆగాడిదే— యెడా—పెడా యెదవ బాసల్లో తిట్టేడుత్తాగుగామోలు. యెవుడికర్మమాడిదే లెగవియ్యా ! పడ్డోళ్ళం మాము శెడ్డోళ్ళమాతామంట.

దాదా:— హంతేనోయ్ గంగాడ్! హందర్కీ హన్నా పడే ఖర్మం హొచ్చిందోయ్ మాకీ ... హంత్కా—ముందూ మాకీ ముసల్మాన్ పేరూసెప్తే హడల్ హస్మంట్దీ ఆ జిన్నా మాకీ హందర్కీ—దగ్గా ఓటూ హేపించీ—భారత్ ఖండాన్కీ—

భద్దలొట్టీ-పాకిస్థాన్మె రాజా హయ్యాడ్. మాకీ హిందూ స్థాన్మె దివాన్ హయ్యాం.

గంగన్న:- అట్టయితే మీా రేసిన వోటు మూలానే నన్నమాట మన దేశం ముక్కలూ-శెక్కలూ - అయ్యిందన్నారు.

మంగన్న:- మా మాల మాదిగోళ్లే సదువు లేని మొద్దులను కుంటే మాకంటే బుద్ధిలేని మెదవ పని శేశారేఁ వియ్యా?

గంగన్న:- పోనీ అయ్యిందేదో అయ్యిందని బుద్ధితెచ్చుకుని మళ్లీ దేశాన్నంతట్నీ కలిపెయ్య గూడదూ?

దాదా:- ఆ ముస్లింలీగ్ ధాన్కీ హొప్పూకుంటాదోఁయ్? అఖండా భారత్ ధేశాన్కీ రెండుఛెక్కల్ పగ్గాఘొట్టీ-అఖిల్ భారత్ పెజల్కీ రెండూ జాతుల్కీ హిడాఘొట్టార్ పాకిస్థాన్మె హిందూల్కీ గా్రబా - హిందుస్థాన్మె ముస ల్మాన్కీ గా్రబా. హాందుల్కే గద్వోఁయ్ మాకీ ముస్లిం పెద్దల్ హాంతా హేర్పాటూ సేసీ-జాతీయముస్లిం హాయ్యా పోతాహుండార్గా?... మళ్లీ హెన్కట్మ్రదీ! మీాకీ మాకీ-హాంతా హన్నా దమ్ముల్ హాయ్యాపోవాల.

గంగన్న:- అన్నదమ్ముల మాశేవోఁగానీ-ఒంట్లో దుమ్ములు మా్త్రం రాల్నియ్. అదుగో! వత్తుండాడు గగ్గయ్యగోరు.

దాదా:- భా్రపే! ...... అరే భాయ్! మీాకీ సలాం సెప్తా మాకీ ఖానాసెయ్యాన్కీ హెల్లింది హాని శెప్పూవోఁయ్. (వెళ్తాడు)

గగ్గయ్య:—(ప్రవేశించి) ఏఁవిరా౽బ్బా !దిబ్బనంతాలయ్యిందా?

కబ్బడు:— లేదఃండి బాబయ్యగోరూ! ఇయ్యాలే యెట్టవ్వద్దుండీ!

గగ్గయ్య:— ఎందుకవ్వుతుందిరా... మీా ఒంట్లో మబ్బాదిత్తేగాని దిప్పపని వదలిపోదు.

దిబ్బడు:— పదారుగురు పనోళ్ళెట్టినా అవనిపని ఒట్టారుగురికెట్టవ్వద్దుండి బాబుగోరూ ?

గగ్గయ్య : ఛా! మాలవెధవల్లార మాళీదున్నపోతుల్లాగ బలిసి మళ్లీ మాట్లాడతా౽రా ? ...... అవ్వును పనిచెయ్యాన మేమి తెలుస్తుందీ? మాపిటేళకే మానెకుధాన్యం కొలిపించుకోవడంమాత్రం తెలుస్తుంది. గాడ్దికొడుకుల్లార ముప్పేటనికొవ్వి కొట్టుకాడుతున్నా౽రా! జవాబుచెప్పేటంతటి జబరదస్తీ నేర్చారుగా? ... కానివ్వండి. జలుబునీళ్లు వదిలిస్తా (మాణిక్యాన్నిచూచి విమోహితుడై జాలినభినయిస్తూ) మాణిక్కీ! దానిగాడు పన్లోకిరాలేదేఁ ?

మాణిక్యం :— మూడురోజులున్నండి మంట జొరం మండిపోతుందిబాబూ! ఒచ్చేపాణం - పొయ్యేపాణం ...... ఈ మూడు పొద్దులూ బిడ్డలూ - మేమూ - గెంజిలేక మలమల మాడిపోతుండాఁవ్. ముక్కు_నూకలైనా దోసిడెట్టిచ్చ్చండి! మాపెకాశం జీతంలో కట్టుకుందురుగాని.

గగ్గయ్య :_ ......సరే ... సాయింత్ర మయ్యాక సావిడి దగ్గరకు రా! (వెళ్తాడు)

మాణిక్యం :– ఎల్లిక్కి ఎల్లకింతలు _ పిల్లికి చెల్లగింతలు ... సాయింత్రపేల సావిడిదగ్గిరికి రావాలంట. నీచుడు ... కులంతక్కువైతే _ గుణం కూడా తక్కువనుకున్నాడు గామోలు.

రంగన్న :_ ఒరే! ఇసుమంటోళ్ళ్ని _ బోర్లగాపొడుకోబెట్టి _ బాలుమని అడిలే తట్టు _ పొలుగుదిగెయ్యాల్రా!

మంగన్న :_ ఊరుకోరా బాబూ! ... గోళ్ళకి చెవ్వులుంటియ్ యీ మాట ఆడికి తెలిసిందంటే _ మనగొంతుకులో కత్తి దిగేత్తాడు.

మాణిక్యం :– (తట్టమోస్తూ శోషవల్ల మూర్ఛిల్లుతుంది)

గంగన్న :_ అరెరెరెరెరెరే! మాణిక్కి పడిపోయిందిరా! రాంరా!! రాంరా!!! ఒరే కబ్బా! తాంబేటి కాయతో నీళ్ళట్టుకురారా! (అందరూ గుమికూడి మాణిక్యమును మూర్ఛ తేరిస్తారు)

మంగన్న :_ పాపం ... మూడురోజులున్నండి కూడు లేదంట్రా! ఒరే కబ్బా! నువ్వూ _ దిబ్బడు దీన్నింటికెత్తుకుపోయి పండబెట్టి రాంరా!

మాణిక్యం :— ఒద్దు బాబూ! ఒద్దు. ఇంటికెళ్తే బత్తెం నాకలియ్యాడు. జబ్బుగా వుంటా మనిశిని ఇంకెన్నాలు జావలేకుండా వుంచను ? యీ రేత్రికైనా గెంజిగాసియ్యకపోతే నోటిపాలారని నాబిడ్డలు పాణాలిడిసిపెడతారు

గంగన్న :— ఇట్టుండామనిశివి యెట్టా తట్టమోత్తావే ? ... ఇంటికిపో !! ఇత్తాడా ? బత్తెం గింజలిత్తాడు — లేకపోతే మాగింజల్లోనే మినాయించి నీ బత్తెం సరిపెడ్తాఁవ్. ఒరే ! దీన్నింటికెత్తుకెల్లండ్రా !

మాణిక్యం :—మీ బిడ్డల్నోటికాడ గింజలు మాకిత్తారా? ఒద్దు! ఆపాపము నేను కట్టుకోలేను. మాగతేఁవైనాసరే.

గంగన్న :—ఓలి పిచ్చముండా! పేదోళ్లకి పేదోళ్లే ఆదారంగాని— కలిగినోళ్లకి కనికారముందంటే?... పో !... ఇంటికిపో ! ... గానగలోదే గంటిడు.

(కబ్బడు—దిబ్బడు—మాణిక్యాన్ని తీసుకెళ్తారు.) (తెరవాల్తుంది)

## మూడో రంగము

(పూరిగుడిసెలో కుక్కిమంచంపై వ్యాధితో మూల్గుతున్నా దానయ్య— క్రిందకూర్చుని వుపచర్యలు చేస్తున్న మాణిక్యం. ప్రక్కనే సోయలేకుండా పడివున్న లత.)

మాణిక్యం:—పాట

జాలి యిదేనా ?... ప్రభో!! ॥జాలి॥
యేల యీకోపము?... దీనులపై—యీ—తాపము॥జాలి॥

మాలోళ్ల మనిసులా ? ప్రభో !... నీ
మనుసెల్ల మారెనా ?
మాలోళ్లపై నీకు లేదా కనికరము ?
పోదేల ఖేదము ? రాదేల నీదయ ?
లేదా ఆదరం ? బీదలమీంద ॥జాలి॥

ప్రకాశం:—(ప్రవేసిస్తూ) అమ్మా !... అమ్మా ! ఇదిగో బువ్వ.
(మూటనిస్తాడు)

మాణిక్యం:—(మూటతీసుకుని విప్పుతూ) యెవ్వరెట్టారు బాబూ బువ్వ ?

ప్రకాశం:—శాంతమ్మ తల్లి పెట్టిందమ్మా !...

మాణిక్యం:—ఆల్లనాన లేడూ ?

ప్రకాశం:—తరవాతొచ్చాడు... అమ్మా !... శాంతమ్మ ... నాకు బువ్వెడతుంటే... సూసీ... సంపేశాడమ్మా !...
(తల్లిపై వాలి దుఃఖిస్తుంటాడు)

మాణిక్యం:—(దుఃఖపూరితంతో – కొడుకును బుజ్జిగిస్తూ) నా బంగారు తండ్రిగా !... ఊరుకో !... ఊరుకో నాయనా ! యేడవకు !... ...దయనేది ఆడితల్లి కడుపులోనుంచే లేదు. జాలనేది ఆడిజీవితంలోనే, కనపడదు... బిడ్డల్ని కూడా కన్నాడు. ఈ నోటి పాలారని నాబిడ్డని నెత్తురుకారే తట్టు కొడ్తాడా ? ఆడిచెయ్యిరిగిపోను. ఆడికళ్లు కాలిపోను. ఆడి...

ప్రకాశం:—(తల్లి నోరుమూసి) అమ్మా! ...తిట్టబాకే!...ఆయనికి తెలిత్తే గుడిసికి నుప్పెడతాడు. ఊరుకో!

మాణిక్యం :— అవును బాబూ! అంతకసాయోడే ఆడు. కడుపారా కనుకున్నా తల్లిని నేనే నిన్నా కసాయోడికి కాళ్ళుగట్టి అప్పగించాను.........ఓయి నాతండ్రా!! నన్ను సంపుకు తీసుకుపో స్వామీ!! ఒకేపుని ఆకలిబాద—మకోకేపుని కొడుకు దెబ్బలబాద – ఇంకోకేపుని పెనిఁవిటి జొరంబాద – తీరని ఆకలి – ఆరనికడుపుమంట – చిరిగిన బట్టలు – చింపిరి తలకట్టులు – తడికెల్లోని గుడిశెలు – తడి ఆరిపోయిన గొంతుకులు – ఇంటిచుట్టూ పెంటపోగులు – కంటిచుట్టూ నీటివాగులు – చిల్లులుబడ్డా మల్లచిప్పలు – చీకటిదేవత చిందులాటలు – ఒల్లెల్లాసారికలు – ఇల్లెల్లా సాలిగూళ్ళు – డొక్కలుమండుకుంటా – పక్కలు యెండుకుంటా – బతికి బాదలుపడేకంటే – సచ్చినా సుకంగా వుండొచ్చు.........

దానయ్య :—(మూలుగుతూ) యేఁవిటే?...సచ్చి...పోతా...నంటుండావ్?...

మాణిక్యం :—సచ్చిపోటంకాదు. అబ్బాయి బువ్వతెచ్చాడంటుండా...లెగు! రొండుముద్దలుతిందువుగాని. (అన్నం తినిపించబోవ బైటదీనాలాపన. నిర్ఘాంతపడి వింటూ వుంటుంది)

భిక్షుకుడు : పాట :—

ఓ ! అన్నపూర్ణమాత ! రావా ?
అన్నము పెట్టించి పోవా ? ఓ॥
కన్నోళ్ళు లేనోణ్ని మాతా !
కాళ్ళడ్డ బీదోణ్ని దాతా !
ఎన్నాళ్ళకీ కూడు లేక
ఎలుగెత్తినా చావురాక
వున్నాను యిల్లిల్లు యెల్లి
పుణ్యాన్ని పొందవా ? తల్లీ ! ఓ॥
(శోషవల్ల పడిపోతాడు)

మాణిక్యం :—అయ్యో ! పాపం ! ముసలోడు మూర్ఛపోయాడు. ముంతతో నీళ్లుతీసుకురాబాబూ ! (భిక్షుకుని మూర్ఛ తేరిస్తుంది)

భిక్షుకుడు :—దణ్ణంవమ్మా ! !

మాణిక్యం :—యేంబాబూ ! పడిపోయాంవే ?

భిక్షుకుడు :—భగ్గుయామింగిలో తొలకరి చినుకులాల — చల్లని మాటలెన్నాళ్ళకిన్నాను తల్లీ. పోరాగాడిదీ ! —దున్నపోతులాగుండావ్ — పాటదుకోలేవ్రా ? అని తిట్టోళ్ళేగాని — పట్టెడు మెతుకు లేసి పాణాల్నిలిపిన పుణ్యాత్ముల్లేక పోయారు. మూడుకాళ్ళముసలాణ్ని — పైగా మూర్ఛ —

పాటముకోడానికి పట్టుతప్పిపోయింది. యెనకా ముందూ యెవరూలేనోణ్ని — యీగుక్కెడుపాణం యెప్పుడు గుటుక్కుమంటుందా అని యెదురుసూత్తుండా — యీనాలికి మీాద దారకంబోసి నాలుగోరోజు తల్లీ !!

మాణిక్యం :—అయ్యో నాతండ్రా ! మా యింట్లో అన్నమింది తినిపిస్తానుండు ! బాబూ !... ఆ మల్లిట్టా పట్టుకురా ! (మల్లలోని అన్నాన్ని తినిపిస్తూవుంటుంది.)

భిక్షకుడు :—నా బంగారుతల్లి ! ... కొడుకులు — కూతుళ్లు — సుకంగ వర్దిల్లమ్మ ... ... ... మీారు తిన్నారమ్మా ?

మాణిక్యం :—అయ్యో పిచ్చిబాబ ! యీ పూరి గుడిసెల్లో ఆళ్లుతినగా— ఇంకొకళ్లికి పెట్టే అన్నముంటదా ?... ఆకల్తో మా కడుపులు మాగు కట్టుకుపోయినియ్ నువ్ తిన్నాయన ! తిను !

భిక్షకుడు :—యేంవంటుండావమ్మా!... జబ్బుగావుండా నీబగ్గి— ఆకల్తో నక నక లాడ్తా కళ్ళల్లో వూపిరెట్టుకున్నా నీబిడ్డలికీ— పెట్టకుండా వుండానాలుగుమెతుకులూ నాకు తినిపించావా! ... ... అయ్యో! నేనెంతపాపాత్ముణ్ని ? ... ... అమ్మా ! నువ్వు మానవురాలివికావు. దేవలోకంనుంచి దిగొచ్చిన దేవతామూర్తివి. (పాదాలంటుతూ) నీ బిడ్డల్నోటికాడ కూడు తినేశాను దుర్మార్గుణ్ని నన్ను శపించెయ్ తల్లీ !

మాణిక్యం:— ఒద్దునాయనా! అలాఅనకు ఆ కల్లో వుండా బాద నాకూ తెలుసు గనుక ఆకల్లో బాదపడ్తూండా నిన్ను చూడలేక పోయాను. అంతే. మాకర్మ మేమాతుందో బోతుంది.

భిక్షకుడు :—అమ్మా!... మీా మొకాలుబ్బా ళ్ళేను... పోతా. (వెళ్తాడు).

స్వామీజీ :—(ప్రవేశిస్తూ) ఆహా! ... యీా పేదలకున్నా ఔదార్యాన్లో పదోవంతైనా ధనికులకుంటే దేశమేనాడో స్వాతంత్ర సౌఖ్య మనుభవిస్తూ ప్రపంచరాజ్యాల్లో కీర్తివంతమై వుండేదిగదా?

మాణిక్యం :—(స్వామీజీని ఆహ్వానిస్తూ) బాక్కెడు గెంజిలేక పొక్కిపోతుండాం. యీా దిక్కుమాలిన గుడిసిలో కుర్సీ పీటల్లేవు. ఆ కుక్కిమంచ మొక్కటే. కూసోండిబాబూ! (భర్తను) ఇదుగో!... ఓయ్! !... నిన్నే!!!... యెవురో కాంగ్రీసుబాబుగోరొచ్చారు. లెగు! దణ్ణంబెడుదుగాని!

స్వామీజీ:—

ఉ. చాకిరిచేసియున్ పగలు చావునుగానక రాత్రియంతయున్
లోకముమాని మూర్ఖులగు లోభులసేవలొనర్చ్బయీాఘనుల్
యీాకరుణాల వాలురను యీావిధి రాక్షసలీల సల్పు దయా
భీకర కర్కశాధముల పీచమడంగదె కూలిరేనితో.

నీ కొడుకు అన్నం తెచ్చింది లగాయితు – ఇంతవరకు జరిగినదంతా చూస్తూనేవున్నా. ఇదిగో ! నావద్దనూ కొద్దిగానేవుంది ఆహారం కొంచెం కొంచెంతిని ప్రాణాల్నిలుపుకోండి ! (రొట్టెలు పంచ్లుస్తాడు వాళ్ళుతింటూవుంటారు.) కాబోయే చక్రవర్తికి – రాబోయే యీ తేదీని జన్మిస్తాడనగా యాభై మంది నర్సులు–రెండేభై లుడ్రస్సులు – వారి ప్రాణాల్ని లిపే యీ బాబులికి మానరక్షణకైనా చింకిపేలికల్లేవు ప్రాణ రక్షణకైనా పట్టెడు మెతుకుల్లేవు... కాలమహిమ.

సీ. మిడి మిడి యెండలో బడిమాడు నొకరుఁడు
పార్కుమారుతములో కూర్కునొకఁడు
శే బగల్ హాలములో రబస బొందెడొకఁడు
పరుపుపై పవళించు ప్రభువొకండు
గుక్కెడు గంజికై డొక్క లార్చునొకండు
పంచ భక్ష్యము లారగించు నొకఁడు
చలిమంచు వర్షాల చచ్చిపోయే డొకఁడు
కాశ్మీర శాలువల్ కప్పు నొకఁడు

గీ, తల్లి దండ్రులు తోడులున్ దారసుతులు
యిల్లు ఒల్లెల్ల గుల్లగా కొల్లగొట్టి
ముక్కునాకలు పోయుదు రొక్కశేరు
ధర్మపాలన కలుగదా ? కార్మికునకు.

సీ. కాఫి హోటళ్ళకు కైపు జల్సాలకు
లెక్క-చేయరు పచ్చచెక్కలెన్నొ
కోర్టులంచాలకు కోతివేషాలకు
లెక్క-చేయరు పచ్చచెక్క లెన్నొ
సిలుకువస్త్రాలకు చిలిపి శస్త్రాలకు
లెక్క-చేయరు పచ్చచెక్కలెన్నొ
కార్ల శికార్లకు క్లబ్బు సర్దాలకు
లెక్క-చేయరు పచ్చచెక్కలెన్నొ

కాని డొక్కలెండేద్చుచు కార్మికునకు
ఒక్క కాసైన యివ్వరు దక్కనీరు
పచ్చిరక్తాన్ని వెచ్చించి తెచ్చిపోయు
పిచ్చికంచాల గొలుతురు తుచ్ఛులకట ॥

మాణిక్యం:— బాబూ! పాణాల్నిలబెట్టారు. యెన్నిజన్మాలెత్తి పూజించినా మీఋణం తీర్చుకోలేము.

స్వామీజీ:— అయ్యో! పిచ్చితల్లీ!... ఈఘోర రాక్షసకోరల మధ్య ధ్వంసమైన మీదుర్బలదేహము-క్రూరకిరాతక కఱకు మఱలమధ్యనలిగి నామమాత్రమై నిలబడిన మీశల్యసమూహము-దిశలం దయాకిరణ ప్రసారం బొనర్చు మీనేత్రద్వయ తేజఃపుంజము-పవిత్రజ్యోతియై వెలుగు ప్రేమహృదయము-పట్టుతగ్గని ప్రజ్ఞ-ప్రాభవము సడలని ప్రతిభ-బిగువు

తగ్గని ప్రేమ-బింకముజంకని దయ-అపర తేజస్సుతో వెలుగు మిమ్మాదరించని వ్యక్తి-ప్రేమించనిజీవి-దయచూపని ప్రాణి బ్రతికి యుండుటకన్న-చచ్చిన మేలు ప్రతి ప్రాణికీ ప్రాణభిక్ష పెట్టెడు మీ పవిత్ర పాదపద్మాలను ప్రభాత భేరీ నినాదా లతో పువ్వులం పూజించిన నాడే మాఋణం తీరేది. మీ ప్రతి రక్తాణువునూ పిండిన రసముగు చెమటను, ఒక మహా తటాకమునచేర్చి యేడు పర్యాయములు కాచిన ఆయావిరి స్వరూపమే యీబొబ్బట్టబాబులు భోంచెయు భోజనస్వరూ పము. మీరునిర్మించినదానిని మీకు తినిపించుటలో నన్ను పూజించుటెందుకమ్మా?... అయ్యో! ఆవేదన్లోకర్తవ్యాన్ని మరిచాను. రోగికి ప్రస్తుతం ఇంజక్షనిస్తాను తర్వాత మందు కొరకు అబ్బాయినిపంపు! (ఇంజక్షన్ చేస్తాడు)

దానయ్య:- స్వామీ!... పాపాత్ముణ్ణి... పాదాలు... పట్టు కుంటానిక్కూడా... పనికిరాని... కులం ... తక్కువోణ్ణి కూటికి... లేని... కటికి... బీదోణ్ణి... డబ్బేమీ... యిచ్చు కోలేను. ... బాబయ్యా!... తమురికి... యేంపని... వుందో సెప్పండి!... మా యింటిలపాదీ... సచ్చిందాక ... రోజూ క వూట... శేసాత్తాం.

స్వామిజీ:- అక్కర్లేదునాయనా! డొక్కలంటుకుపోయినదిక్కు మాలినవారగు మీతో వుచితంగా చాకిరిచేయించుకొనే

కుక్క_జీవితం నాకక్కర్లేదు. అయినా మీరుచేయదగ్గా పనీలేదు.

దానయ్య:_ అయితే...తమురెవరు? ... యెక్కడుంటారు? యేంజేత్తారు. బాబూ?

స్వామీజీ:_నాకథ చెప్పాలంటే పెద్దగాథ. తర్వాత వివరంగా చెప్పతాను_నేను వృత్తమవిద్య నభ్యసించాను. నావిద్య_నాబుద్ధి - నాధనం - నాయౌవనం - నా సర్వస్వమూ హరిజనసేవా కైంకర్యం చేయనెంచాను. నాకు భార్యా బిడ్డలుగాని - బంధుమిత్రులుగాని_శూన్యం. దీనజన బాంధవులే నా బంధువులు. విశ్వకళ్యాణ పాత్రులే నా మిత్రులు_బక్కచిక్కి డొక్కలోడిన కార్మిక యోధులే - నాకన్న కొడుకులు. హరిజనోద్ధారకులే నాసోదరులు_సత్య అహింసలే నామూల సూత్రాలు. శాంతిసమరమే నా శస్త్ర ప్రయోగము శ్రీ శ్రీ శ్రీ మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ మహాత్ముని హితార్థమే నాకర్మ పరిపక్వవిధానము_నా బోధనము_కళంకిత ప్రజాకోటికి ముక్తి సాధనము... ప్రస్తుతం ఒక్కముఖ్య విషయంమాత్రం వివరిస్తా. చదువు లేని కారణాన ఆరోగ్యవిధానం_ఆర్థిక నిదానం_భక్తి పారవశ్యం_శక్తిసామరస్యం_జీవన భృతి - పావనస్మృతి_విజ్ఞానం వికాసం_వెయ్యేల? సర్వస్వం విద్యలేని కారణాన నిర్వీర్యమగును. నేటినుండే మీ బిడ్డలకి విద్యనేర్పించండి. అవసర

మైతే నేనే వీరిని వుత్తీర్ణుల గావిస్తాను. పట్టంపంపి పట్టభద్రులయ్యేటట్లు ప్రయత్నిస్తాను.

మాణిక్యం:- ఆసాం పన్లో కెల్లకపోతే - ఒల్లుకుమలబాడిచి- యిల్లుకు నుప్పంటిత్తాడు బాబూ!

స్వామీజీ:- ఆసాంపనికి అభ్యంతరన్లేకుండా అంతా నేను సర్దుకుంటాను.

దానయ్య:- శిత్తంబాబయ్యా! మీబిడ్డలే అనుకోండి.

(స్వామీజీ ప్రకాశ్ను - లతను తీసుకువెళ్తూ)

(పాటముందుపాడి - పిల్లలతో వెనుక పాడించుట)

పాట :-

శాంతి యిదే శుభకాంతియిదే
వింతపశువులను - వికృతరూపులను
పంతముతో పరమామోదముతో
ప్రజ్ఞానిధులను చేసెడి విద్యయె ॥శాంతి॥

(వెళ్తారు - తెరవాల్తుంది)



# నవయుగము

[సాంఘిక నాటకము]

## రెండో అంకం – మొదటిరంగం

(గర్గయ్యగారి వుద్యానవనంలో పాడుకుంటూ పనిచేస్తున్న ప్రకాశ్)

ప్రకాశం :—పాట.

విదేశాలలో విజ్ఞానములో
వేదవిధులలో – విశ్వశాంతిలో
మేధానిధులలో – మేటిఘనులలో ॥శాంతి॥
విద్యవిదేశ విశేషబంధువే
విద్యయె దాచిన కోట్లధనంబే
విద్యావిరోధి విషసర్పపువిధి ॥శాంతి॥

శాంత :— (ప్రవేశించి) ఆహా! యెంత మధురంగావుంది ప్రకాశం నీ విద్యాప్రచారప్పాట? ఇంత కొద్దికాలన్లో యెంత పెద్దగా మారిపోయావ్?

ప్రకాశం :—ప్రకాశంపాడే వికారప్పాటలికి శాంతాదేవిగారు సంతోషించడన్లో వింతేముందిలెండి. మీదయవల్లనేగా యీజయభేరీ ప్రమోతలు!

శాంత :—అవునుగానీ...ప్రకాశం! నీవు స్వామిజీవద్ద విద్యా ప్రారంభంచేశావో – లేదో – మానాన్నగారు మహా

ప్రళయరుద్రుడులాగ మండిపడిపోతున్నారు. ఆమంటల తాకిడిలోనుండి నీవెలా మళ్లుకుంటావో.

ప్రకాశం :—యేమోతల్లీ! కష్టాలకీ - రొష్టులకీ - నష్టాలకీ - నిష్టూరాలకీ భరించి - కన్నతల్లిలాగ కడుపులో దాచుకుంటూన్నావు. నాకర్మమెలావుందో - అలా అవుతుంది.

శాంత :—మానాన్నగారొచ్చేవేళైంది. ఇవిగో డబ్బులు. వీటితో పుస్తకాలు కొనించుకో!... త్వరగావెళ్ళు!

ప్రకాశం :—అమ్మా!... యీసంగతి దొరగారికి తెలిసిందంటే మొఖుకుల్లో సున్నముండదు. నన్ను గురించి నిన్నూ చంపేస్తారు. ఒద్దమ్మా! ఒద్దు!

శాంత :— గీ. ధనము ధాన్యంబు ధ్యానంబు ఘనత ప్రాణ
స్థాన విజ్ఞాన సువిధాన మానపటిమ
విద్య లేక ని వన్ని నిర్వీర్య మగుట
విద్యకై బాధబొందుట వేడ్కగాదె.

గగ్గయ్య :— (ప్రవేశిస్తూ) యేఁవిటమ్మా ?... వుపన్యాసాన్ని వూపిరితిరక్కుండా వూదేస్తున్నావూ ?... ... యేఁవిటా వేదాంతం ? కాస్తచెప్పు ?... ... ఒళ్లువాచిన గంగానమ్మ- యిల్లెక్కి- చిందు త్రొక్కిందట ... పో! పోవేమే యింట్లోకి (ప్రకాశం వైపుచూస్తూ) యేఁవిటా) గడుగ్గాయ్ గాడ్ది

కొడకా ! యేంవిటీ గొడవంతా ! .........ఆ గుప్పిట్లో గుట్టేంవిటీ !

ప్రకాశం:—యేం_యేం_యేం_యేం_లే_లే_లే_లేదుండి ! ......

గగ్గయ్య:—యేంవీ లేవూ ?? గుడిసేటి కుక్కలకొడక !......

యేంవీలేదని నాకు యెదురుచెప్తావా ! (కొడ్తూండగా డబ్బులుపడిపోతయ్)

శాంత:— నాన్నా ! నాన్నా !! కొట్టొద్దునాన్నా ! పుస్తకాలు కొనుక్కోమని నేనే యిచ్చాను. ఆ దిక్కుమాల్నాణ్ని కొట్టొద్దు నాన్నా !

గగ్గయ్య:—యేంవిటే !......ఓసిబడవా ముండా ! కొంపంతా యిలాదోచి పెడ్తావుండి - ఆ దిక్కుమాల్నాణ్ని కొట్టొద్దు నాన్నా ! అని చక్కట్లు దిద్దొచ్చావా ? (కొడ్తూ) పో ! యింట్లోకి (లోనికినెట్టి) యేంవిరా మాలకాకీ ! మాయ మాటల్జెప్పి-మా అమ్మాయికి మసిబూసి మారేడిగాయం జేసి-మాకొంపంతా యిలామారణం చేస్తావా ! (కొడ్తాడు)

ప్రకాశం:—దణ్ణంబాబో ! ...దణ్ణం... బాబో !...దణ్ణం... దణ్ణం...

గగ్గయ్య:—దణ్ణాలుపెడ్తే దయజూపాల్సిన జాతేనా మీమాల మాదిగజాతి ? (కొడ్తూ) ఈమాలమాదిగ జాతుల్ని-కాళ్ల క్రిందవేసి-మట్టగించి - కండలు కండలుచీల్చి-కణకణ లాడే

నిప్పుల్లో మాడ్చి-మసిచేసీ - కళాపానీళ్లల్లో కలిపి-జల్లేస్తే పాపం తీరుతుందా ? చావు ముండాకొడక ! (గ్రహాచారం వొదిలిపోతుంది (స్మృతితప్పి పడిపోయెలాగుకొట్టి వెల్తాడు)

దానయ్య:— (ప్రవేశిస్తూ) బాబుగోరుండీ ! ...బత్తెం నూక లిప్పిచ్చుండి దొరా! బాగా సీకటడి పోయింది (క్రింద పడున్న ప్రకాశంనుచూచి) పెకాశంవా!... అయ్యో ! ఒల్లంతా నెత్తురు వరదలు—యేంబాబూ ? యేమైంది ? (లేవదీసి ఒడిలోకి చేర్చుకుని శరీరమంతా తడుముతూ) ఒల్లంతా యెక్కడ జూసినా ముక్క-జొన్న కండెల్లాగా కదుంవులుగట్టినియ్—నాబిడ్డని సంపుకుతిన్నాడే రాకాసి ముండాకొడుకు ఇంతకసాయి తనంగాకొట్టి సంపెయిటానికి మేమేంపాపంజేశాం ! —పగులంతా పాటడి పెడ్తామే - తగువొత్తే తలకాయొడ్డుతామే తెగ్గోసినా దొంగతనం జెయ్యమే - నిగ్గదీసినా అబద్దాలాడమే-పంటంతాగాదిల్లో బోసి కంటినీళ్లో యింటికెళ్తామే-పరమాణ్ణాలు మేసి-పట్టెడు పాసిపోయినమెతుకులికి నోసుకోమే-శెమటూర్చిపండిత్తామే చెప్పుతో దన్నినా సేవిత్తామే - బండబూతుల్ని బవుమతులుకింద బావిత్తామే - తప్పంటే నన్ను దన్నగూడదూ? నోటిపాలారని నా పసిపాపని - నెత్తురు వరదలయ్యేతట్టు నోటిమాట పోయేతట్టు - ఒల్లుకదుంవులు గట్టేతట్టు - కళ్లుమూతలు పడేతట్టు - సోయరాకుండా - సొంపు

లేకుండా - మూలుగుడుట్టి - ముచ్చెవటలట్టి ముద్దాల ముడుసుకు పోయేతట్టు జేశాడే - పచ్చినెత్తురు దాగే రాచ్చాసిపన్జేశాడే - దర్మంవే సచ్చిపోయిందా? దయా దాచ్చిణ్ణాలు నసిచ్చి పోయినియ్యా? కనికారంలేదా? కన్న కడుపుకాదా? ఇంతకటికవమా? ఇంత కావరమా? (ఆవేద నతో కొడుకుని భుజంపై యెత్తుకుని)

గీ. ఆడవోళ్లని పిల్లల ఆవుగొడ్ల
అమ్మ! యని ఆవురుమని అడులుతున్న
కఱకు కత్తికి యెగరేసి నరికినారు
యెప్పుడో యని యేదాన చెప్పాలారు
యీాడికంటెను యెంతో మెరుగాడుగాడె

(వెళ్తాడు—తెరవాల్తుంది.)

## రెండోరంగం.

(గగ్గయ్యగారు చావిడివాలులో యేకాంతముగా పచారుచేస్తూ)

గగ్గయ్య:—మెడకాయమీాద తలకాయుండా ప్రతివాడు నాయకుడే. యే వ్రపన్నాసాన్ని యేడవలేకపోయినా - "కుల తత్వాలు కూలిపోవాలి" అని ఆ రెండుముక్కలూ నేర్చు కోవడం - గాంధీటోపీ - నెహ్రూకోటూ తగిలించుకోవ డం - నేనూ ఒక ముండమోపినే అని బయల్దేరడం...

వియ్యాల్లోగాని విరగడై పోదంట విషం... మొనగాళ్లు...
బయల్దేరారు... హేమా హేమీలంతా కెల్లికిల బడితే –
పులిస్తరాకు లొచ్చినాయ్ బొర్లబడ్డానికి

సీ. రామానుజా శంకరాచార్య వరులెల్ల
తోకజాడించారు తోలుగప్పి
బుద్ధశివాజాది పూజ్య ప్రవక్తలు
సోదిచెప్పియు పట్టె బోదిగట్టు
హరిజనులంటు దేవాలయ ప్రవేశ
మంటు నాయకులెల్ల మంటగలిపె
కులుకు పలుకులతోడ పిలకనూపినగాంధి
హా! రామ! యని మొన్న ఆవులించె
యెందరెందరో యెంతెంతో యేడ్చి యేడ్చి
బింకముల జూపి పట్టిరి డొంకదారి
హైందవాచారముల పరిహాస పఱచ
కళ్లు గలిగినదా! లేక బుఱ్ఱలేదా?
పిల్లిముద్దిలి గొట్టగ – పందికొక్కులు కోలాటమెయ్యగ
అన్నట్లు

గీ. మాల మాదిగ కోతులు మంత్రులంట
వీరు హరిజనులంట శ్రీ గారులంట
మొదలు మావాళ్ల బుఱ్ఱలో మెదడు మెదడో
కాక కొల్లేటి దాలవా గంజిబెదడో

చూస్తాను ... యీ మాల మాదిగల గర్వమెంత వరకో చూస్తాను. యీ గ్రామానికి యేనాడు వెన్నుబద్ద యెత్తారో ... ఇంతచాకిరి వీళ్ళకిచెయ్యడం — ఇంతగంజి వాళ్ళకి పొయ్యడం. యెప్పుడైనా మాలమాదిగలు బయటికి బయల్దేరాలొస్తే — అడుగులు చెరపడానికి నడుముకు తాటాకు — వుమ్మి వేయడానికి చంకలోకుమ్మరి ముంత ... రామరామ! యీ కాలాని కేంకడగండ్లొచ్చినయ్యో — కాఫీహోటల్లో వాడు కాంగ్రెడిచి వూసినా — వీడు కళ్ళకద్దుకుని మింగేయాల్సిందేనంట మెదిల్తే శాసనమంట—కదిల్తే కాంగ్రెసంట—కాదంటే కమ్యూనిష్టు — లేదంటే లేబరుపార్టీ — పేచీవస్తే — ఫెడరేషన్. పెసరట్లూవాళ్ళే — శెక్కరకడ్డిలూవాళ్ళే — సినిమా యాక్టర్లూవాళ్ళే చెక్కింగ్ కలెక్టర్లూవాళ్ళే — కచ్చేరీల్లోనూ వాళ్ళె — లెక్చరర్లూవాళ్ళె — పెళ్ళిలోవాళ్ళు — పేరంటన్లో వాళ్ళు — ఇంటిలో వాళ్ళు — మంటిలో వాళ్ళు — రచ్చలోవాళ్ళు రైల్లోవాళ్ళు — రోగన్లోవాళ్ళు — భోగన్లోవాళ్ళు — చావులోవాళ్ళు — శ్రార్ధన్లో వాళ్ళు — వాళ్ళు — వాళ్ళు — వాళ్ళు — యీ వాళ్ళుకు విషపుగాళ్ళె నాసుళ్ళు జుట్టడన్లేదు ... ఇంతకీ ఈ కాంగ్రెసోళ్ళ మూలంగా సంత బజారై పోయింది సనాతనధర్మమంతాను ......ముందు వీళ్ళ భరతంపడితేగాని — వాళ్ళు షరతుకు లొంగి రారు ... ...ఆఁ! ... వాళ్ళు వేళ్ళతోనే వాళ్ళకళ్ళు పొడిపించాలి ... ఒరే! దాదా!!... దాదా!!! ... ఆరిపాడుముండాకొడక

పిలిస్తే పలకవేఁరా ? ... రామరామా ! వీడితో చావొచ్చి పడిందే ... ఒరే ! ... దాదా ! !

దాదా :— (ప్రవేశిస్తూ) ఆఁ ! ఆఁ ! ... సలాంహాండీ !

గగ్గయ్య :— సలాం గాదు – నీ శ్రార్ధం — చిలిపివెధవ — పిలిచినప్పుడు పరుగెత్తుకురాని నీ సలాం చంకనాకనంట్రా ?

దాదా :— సలాం సంకానాకే ధాన్కి — నాల్కె హెడ్డా హుందండీ !

గగ్గయ్య :— నీ మొఖన్లోవుంది. చాద స్తపు ముండాకొడక చాద స్తపు ముండాకొడకని. చెప్పినపని చేసేడవడన్లేదు ... త్వరగావెళ్ళి కబ్బణ్ని – దిబ్బణ్ని – పిలుచుకురా !

దాదా :—మాబాబూఖంటే మా హమ్మా ముందూసన్థే మాకీ ముంజాఖొడ్కు హెట్టా హయ్యాం హాందీ ? ?

గగ్గయ్య :— ఆరి కంత్రీగాడిదా – చెప్పినపని చెయ్యరాముందు ఇదిగో ! ఆగఁవళ్ళ చలమాయికి యీడబ్బిచ్చి నేనిమ్మన్నా నని నాలుగు సారాబుడ్లు తీసుకురా !

దాదా :— దుకాణాల్ హెత్త్ హేశార్ ఘుదండీ ?

గగ్గయ్య :— వాళ్లేదో వంటదో – మంటదో – తంటాలు పడు తున్నార్లే వెళ్ళరా ! — నేనిమ్మన్నానని చెప్పు ! — జాగ్రత్తగా తీసుకురా ! యెవడైనా కాంగ్రేసోడు

చూచాడంటే - ఖైదుకు పంపేవరకూ విడిచిపెట్టడు జాగ్రత్త! — దాన్లోకి నంజుళ్ళూ — మరిచిపోయేవ్

దాదా:— (డబ్బుతీసుకుని నిమ్కృమిస్తాడు)

గిరీశయ్య:— సారాబుడ్లతోగాని చక్కబడదు వ్యవహారం సారాయంటే సామాన్యమా ?

సీ. లోభివాడొక డ్రాము లోపలబోసిన
దాన కర్ణుడుకూడ దద్దరిల్లు
కుంటివానికొక్క గుక్కెడు ద్రాగించ
గామపైకు స్త్రీకి కాలుదువ్వు
పిఱికివానికి కాస్త సఱుకుమెక్కించిన
నలుకులాటకు ముందుకుఱుకుచుండు
కొజ్జవానికి కాస్త బొజ్జలోబోసిన
పెండ్లాడ పరుగెత్తు పిల్లకొఱకు

కవులు గాయకులు యాకర్లు కలకర్లు
అర్చకులు హారతీయులు హాళికులును
జూదరులు జార చోరులు జులుముగాళ్లు
కాస్తసేవింప కడుగైన కదప లేరు
అట్టిలోకైక స్వర్గమా అమృతమును
హాతముసేయగ కాంగ్రేసు అబ్బతరమె
అదుగో వస్తూనే వున్నాడు దాదా

దాదా:— (ప్రవేశించి) హిద్దోనండీ సర్కా—
గగ్గయ్య:— వాళ్లేరా ?
దాదా:— వార్గో! హాస్తా హుండార్గదండీ !
గగ్గయ్య:— వస్తున్నారూ ?!... బలే అసాధ్యుడివిరానువ్వు !
దాదా:— ఆఁ! ... హేమ్టో హనుకున్నార్ మరీ ?... ముస ల్మానీ— దెబ్బాహంటే— పాకిస్థాన్ మె అబ్బా ! అనాల
గగ్గయ్య— యేడ్షావ్ ! వెధవసోదీ నువ్వూను — సరేగాని— యీసరుకంతా వాళ్లకి సంపూర్ణంగా యెక్కించి – ఛాన్సు వొరికి నప్పుడు గేస్ కొడ్తాండు !
కబ్బడు:— దిబ్బడు:— (ప్రవేశించి) దణ్ణాలుండి దొరా !
గగ్గయ్య:— యేఁ విరా కబ్బా ! — దిబ్బడు బొత్తిగా మబ్బు గమ్మినట్టున్నాడేఁ !
దిబ్బడు:— లేదుండి బాబయ్యా ! కల్లుకొట్లు కళ్లక్కనబడ కుండా చేశారుగా కాంగ్రేసోళ్లు
గగ్గయ్య:— అప్పుడప్పుడు యేడ్షేవెధవాయలూ మాదగ్గరికొచ్చి మిడక్కూడదూ ?
కబ్బడు:— శిత్తం బాబయ్యా ! అడిగితే మూతిమీద తంతా రని జడిశాం – అంతే.
గగ్గయ్య:— నమ్మకంగావుండే గాడుదున్నైతే —
దిబ్బడు:— నమ్మకంగా కేందొరా ! తమురు శెప్పించానికి తలా డెయ్ మా !

గగ్గయ్య:— సరేగాని — ముందా సారాయి తాగేడవండి!
(వెళ్తాడు.)

దాదా:— (సారాబుడ్లు వాళ్లకందించి) అరే కబడ్! మీాకీ హాద్దుష్టం మసాలా ఖుర్మాలో మఖాంసేసీ – పలావ్ డేక్షాలో పక్కాయేసీ – హాల్వామేసీ–హాంజూరాభోర్కే– బీడీ కాల్సే – ఘుడాక్ పీస్సే – ఘుమ్మొత్రపోయిందిబే!
(నిష్క్రమిస్తాడు)

దిబ్బడు:— అబ్బ! — నుప్పంటిసారారా బామ్మది!

కబ్బడు:— నుప్పంటి సారాయేంట్రా? సలిముండ! దానప్పంటి సారాయైతేనూ.

పాట:—

నుప్పులాంటిసారాతాగి – గొప్పకవురు సెప్పొతుంటే–
కొప్పులో పువ్వొగిరింది – పప్పులో కాలుపడింది–
అప్పన్నా తన్నామన్నా – డప్పడబ్బు సేసిందిరన్నా!॥

దిబ్బడు;—అరే!... మూరంటుసారాతాగి – మసాళాసీకులాగి– పేరంటం పరిగెత్తింది. పైటిసెంగు జాడిచ్చింది – మేరే – మాలాబులాలో – సూరుణ్ణాయ్యానురో! ॥మేరే॥

కబ్బడు:—ఒరే! బావా! సూరుణ్ణి నరికెత్తా నుంట్రా!

దిబ్బడు:—ఒరే! సన్నుగుడా! సూరుణ్ణరికేత్తే– శీకటేసిపో దంట్రా?

కబ్బడు :—ఒరే ! నేను శెప్పుతినమంటే – శెప్పుతింటావా ? లేదా ?

దిబ్బడు ;—నువ్వు శెప్పుతింటారా

కబ్బడు :—నాను శూరుణ్ణి రికెత్తా నన్నాను... అంతే.

దిబ్బడు :—నాను శీక టేసిద్ది అన్నాను... అంతే.

కబ్బడు :—సీక టేసేది – బోకు లేసేది నరికేత్తానంటే–నరికేత్తా. అంతే. (సూర్యుని నరికేవృద్దేశంతో నరుకబోయి వెల్లికిల బడతాడు.)

దిబ్బడు :—(తూలుతూ కబ్బని లేవదీసి తూలుతున్నా కబ్బని చూచి వెకిలినవ్వు నవ్వుతుంటాడు. దిబ్బనిచూచి కబ్బడూ మొదలెడ్తాడు నవ్వు)

గద్దయ్య :—(ప్రవేశించి) ఒరే !!

కబ్బడు :—శిత్తం బాబయ్యా ! శిత్తం — మాబలేసారాపో యిచ్చారుదొరా !

దిబ్బడు :—బలేసారాయేంట్రా దేవియ్యా ! దాని బావియ్య సారాపోయిత్తాడ్రా ! దొరగోరు.

గద్దయ్య :—నేను చెప్పినట్లు చేశారంటే – మీకెప్పుడూ లోటుండదు.

కబ్బడు :—ఓ !!—తము రేదిశెప్పితే అది దంచేత్తాం. తమురు తన్నమనోళ్ణిన్ని తంతాం — తమురు సంపమనోళ్ణిన్ని సంపుతాం.

దిబ్బడు :—అంతేనండి అంతేనండి !

గగ్గయ్య :— ఈ డబ్బు తీసుకుని జోరుగా జల్సాచేసుకోండి !
లేనప్పుడు నన్నడుగుతూండండి !

కబ్బడు : దిబ్బడు :—శిత్తం శిత్తం (డబ్బుతీసుకుని)దండాల్దొరా!
(వెళ్తారు)

గగ్గయ్య :— ఈ గగ్గయ్యగారి కంసపాత్రముందు గారడీ
వేషాలు పనికొస్తాయనుకున్నారు గాబోలు : ఇంకచూపిస్తా
మన తడాకా (నిష్క్రమిస్తాడు - అవనికజారుతుంది)



# న వ యు గ ము

[సాంఘిక నాటకము]

## మూడో అంకం – మొదటిరంగం

(మాణిక్యం తనగుడిసె వెలుపల గృహకృత్యాలు చేసుకుంటూంటుంది)

గగ్గయ్య:–(ప్రవేశించి) మాణిక్కీ! పిడింకా ఇంటికిరాలే దేంటే?

మాణిక్యం:–ఇంకారాలేదుండి బాబుగారూ!

గగ్గయ్య:–నీ పిల్లల్ని పట్నం పంపుతున్నారటగా చదువుకి?

మాణిక్యం:–ఆ స్వాంగారి పున్నెంవా అంత సదువు మొదలెట్టారుగా బాబూ... ఆరే పంపుతా మంటుండారు అదుక్కునో పుడుక్కునో–నాలుగచ్చరాలు శెప్పిద్దామనుంది దేవుడెట్టా రచ్చిత్తాడో తెలవదు.

గగ్గయ్య:–వాళ్లనీ–వీళ్లనీ–దేవిరించకపోతే నన్నడగ్గూడదూ? నీ బిడ్డలకి యెంత ఖర్చైనా నేను చదివించకపోయానా?

మాణిక్యం:–గెంజిలోకి వుప్పుగల్లెట్టలేని సావుకాగి–సంతలోకిరా సరుకంతా దారబోత్తా నన్నట్టు–పొద్దాక పాటడిచ్చుకుని బొక్కెడు గెంజిదాగటానికి దోసిడు ముక్కనూక లియ్యలేక కళ్లంట నీళ్లు యిళ్లంట గారుత్తారే? వూరికినె నా బిడ్డల్ని సదివిత్తారా బాబూ??

గగ్గయ్య:—నీబిడ్డల్ని చదివించడం వేగాను. నీకు రకరకాల బుట్ట చేతుల జాకెట్లు-కంచి-బెనారస్-యూనాం-చైనా -జపాన్- సిల్కు-లేగాక వాయిల్సు-గ్లాస్కో- మోడరన్ చీరెలు. త్రిబుల్సు బుట్టలోలకులు-చంద్రమార్కు—సబీదా మోడల్ సుబ్బులక్ష్మి వెరైటీ చైను-కన్నన్ దేవి - కాంచనమాల- అంజలీదేవి-కాలేజీగరల్సు వేసుకునే నానా డిజైన్లు గాజులు కేసర్లు- బేసర్లు-మూసర్లు-ఓహో!! ఒక టేంవిటీ! నీయిష్టం. నీవు సరే అన్నావా యెనిమిదో నాటికి సినిమా కంపెని ఓపెన్ చేసి-నీ యీరోయిన్ పాత్రతో ఫిలిం ఎంటర్ చేయించి-కంపెనీలు -డైరెక్టర్లు - ప్రొడ్యూసర్లు- యాక్టర్లూ-ఫేక్టర్లూ నీకాళ్లముందు కవాతు త్రొక్కేలాగ చేస్తా.

మాణిక్యం:—మీా వుద్దేశమిదా బాబూ?... అయితే యిందుకు మాత్రం అంటులేదు గామోలు దొర్లకి ?

గగ్గయ్య:—ఒకప్పుడు మాత్రం నాకంటుందేవిటే మాణిక్యం ? యేదో లోకనాటకాని కలావుంటానుగాని...... (పట్టుకో బోతాడు)

మాణిక్యం:—(చెంప అదిరేలాగ కొడ్తుంది)

గగ్గయ్య:— ఏమిటా మొంకుతనం ?

మాణిక్యం;—మూరంగావుండు! —నీచుడ! యిందుకు అంటూ- సంటూగాని - ఒట్టూ - వరసాగాని - పాపం-పుణ్యంగాని

లేకుంటే నీకు పెళ్ళాం సచ్చింది. నీ శెల్లులికి మొగుడు సచ్చాడు. ఆమినితీసుకొచ్చి వుంచుకోరాదూ! పాపాత్తుడా కులంతక్కువైతే గుణం కూడా తక్కువను కున్నావా?

గగ్గయ్య:— ఓహోహొహొహొహో!!!— అట్లైతే— నీవు సీతవా! సావిత్రివా? అనసూయవా! అహల్యవా? దమయంతివా! లేక ద్రౌపదివా! ఆ వేషాలన్నీకట్టిపెట్టు! నీలాంటి మాణిక్కాలూ చాలమంది తైతక్కలాడారు మన ముందు. (బలాత్కరిస్తాడు)

మాణిక్యం:— (పెనుగులాడ్తూ) నీచుడ! —మాల మాదిగోళ్ళంటే—మానసం—లేనోళ్లనుకున్నావా? — బాబో!! రచ్చించండి!! రచ్చించండి!!!

స్వామీజీ;— (పరుగిడివచ్చి-విడిపించి-గుర్తించి) మీరా బాబూ!

ఉ॥ రక్తము పిండి పిండి మిముర్రాజుల మాడ్కినిమేపిమేపి యీరిక్తత యెండియెండి బుపరేగు కటీర కుఠారమందు దుశ్శక్తినినిండినిండితమశాంతినుదారసుధాలీలమీముక్తికి మండిమండి నెసమూలును వీరికి మానభంగమా?॥

వీరికి మిగిలింది యీఒక్క-శీలమేగా? దీన్నికూడా దక్కనివ్వగూడదా! ఇప్పుడిప్పుడే ఆశాకిరణాల్ని అంకురింపచేసుకుని-ఆనంద సౌధన్లో హాయిని కూర్చుకుంటూ-అమృతవాహినీ తరంగడోలికల్లో ఊగాడాలని-యేవేవో గాలిమే

డల్ని-కట్టుకుంటూాన్న ఈఅర్భకుల్ని అధఃపాతాళానికి అణగ్రదొక్కడమేనా మీాయాశయం?—అదిగో! నిన్నింతటి మహారాజునిగా తయారుచేసి—తాను యెముకలపై చర్మాన్ని కప్పుకున్నా కర్మయోగి—ధార్మిక యోధుడు—సార్ధక దానయ్య—ఛండభానునివలే వస్తున్నాడు. ఆప్రచండ కిరణాల తాకిడిలో నీపాపం పటాపంచలవుతుంది. ఇంక దిక్కులుచూడక—పారిపోయి ప్రాణాల దక్కించుకో! (గగ్గయ్యను పంపి) పతివ్రతామతల్లీ! ఈపాపాత్ముని ఘాతుక కృత్యాలు నీపతితో చెప్పకు!

దానయ్య:—(మట్టిపని పరికరాలతో ప్రవేశిస్తూ) దణ్ణాలు బాబూ!

ప్రకాశం : లత:— (తండ్రికిఅన్నం దీసుకెళ్లిన ఖాళీపరికరాలతో ప్రవేశిస్తూ) నమస్కారాలండీ!

దానయ్య:— బాబుగోర్నట్టాగే నుంచోబెట్టా వేంవే? మంచం తెచ్చెయ్!

స్వామీజీ:—నాకూర్చోడానికేంగాని...నువ్ స్నానంచేసి భోంచెయ్ దానయ్య!

దానయ్య:—యాంతానం—యాంబోజనం లెండిబాబయ్యా... నట్టేట్లో నేతికి నావదొరికినట్టు—బగ్గు యాసింగిలో యింట్లోబట్టీనినట్టు - అల్లల్లాడే పాణాల్ని చల్లని మాటల్తో

ఓదార్సటానికి దేవుడాల తండ్రురు దొరకటం మేమెంత అదృష్టవంతులుంవి !

స్వామీజీ:—దాని కేంకాని ... మనప్రకాశ్ —లతల్నితొమ్మిదో తరగతిలో చేరేలాగ తయారుచేశాను. పట్నంలో ఒక జాతీయహైస్కూల్లో చేర్చడానికి మాట్లాడాను. అక్కడే కస్తూరిబా ఉచిత భోజనశాలలో వసతికూడా యేర్పర చాను. యీాదినమే వెళ్లకపోతే ఖాళీలు పూర్తి వుతయ్యేమో?

దాన:—బాబూ! కన్నతండ్రికన్నా యెక్కువగా మమ్మల్ని—మాపిల్లల్ని కాపాడుతుండారు. తండ్రురి మాట కడ్డం శెప్తాతాండా? తచ్చిణంవే తీసుకెల్లుండి !

స్వామీజీ:—మీా తల్లిదండ్రులగ్గిర శెలవు తీసుకొండి!

ప్రకాశం:—సీ॥ నవమాసములుమోసి భవసౌఖ్యముల బాసి
దోసిళ్లతో తులదూచినారు

లత:— కూడుగుడ్డలకేడ్చి కుమిలపోయెడి బాధ
గూర్చగా మమ్ము నోదార్చినారు

ప్రకాశం:— అలసిపోయినవేళ అలయించి సొలయించి
మించి విసిగించగా బెంచినారు

లత:— అష్ట కష్టములొంది నష్టంబులను గుంది
నిష్ఠతో విద్యల నేర్పినారు

ప్రకాశం:— గీ. బాబ! నీ పాదపద్మాల బట్టినాము
వేగ దీవించి పంపుమా విద్య కొరకు
లత:— అమ్మ! యాశీర్వదించు నీయాత్మతోడ
పూజసేయుదు మేవేళ పుణ్యులార!

దానయ్య :—(బిడ్డల్ని కౌగిలించుకొని) మోటోళ్ళవి బాబా! యాఁవని దీవిచ్చఁవ్రూ?... సుకంగ యెల్లిరండి! తక్కువ కులంలో పుట్టాఁవ్ యెక్కువ సదువుల్నేర్సినా — తక్కు-వోళ్ళి మాత్రం మర్సిపోకండీ?

మాణిక్యం:—పోయిరండి బాబూ!... పోయిరండి !... బెంగ పెట్టుకోకుండా వుండండీ? పెద్దసదువుల్నేర్సినా — మనంటి దిక్కు-లేని బీదోళ్ళమీద దయగావుండండీ ?

స్వామీజీ:—(ప్రకాశ్ — లతలతో నిష్క్రమిస్తారు;)

దానయ్య:—వూరుకో! ... బిడ్డల్నంపి — యెనకా లేదు త్తుంటే — ఆళ్ళకేజయం...

కబ్బడు — దిబ్బడు :— (వెనకనుండి ప్రవేశించి ఆ యిరువుర్ని బలంగాకొట్టి పడగొడ్తారు)

గగ్గయ్య:—(ప్రవేశిస్తూ) లాగెయ్యండా గుడిసి ... ముంతా — మూకుడూ అట్టీ—చట్టీ బయట పారెయ్యండి!

కబ్బడు: దిబ్బడు:—(సామాన్లన్నీ పారేస్తూంటారు)

గగ్గయ్య:— గెంటండి ! ... మెడబట్టి అవతలగ్గెంటెయ్యండా —— కూటికిలేని గాడ్దికొడుకులికి — కూలీసంఘాలా ? !... వూరి బయటికి గెంటెయ్యండి ముందు !

కబ్బుసు; దిబ్బుసు:–(పడివున్నా మాణిక్యాన్ని దానయ్యాలను లేవదీసి బైటకుగొంటు కెళ్తారు)

(తెరవాల్తుంది.)

## రెండో రంగము.

(గగ్గయ్యగారి వుద్యాన వనంలో యేకాంతంగా విచారంతో శాంత)

శాంత : పాట:–

నిను బాసి ఓర్వజాల–మనజాల మానశీల ! ॥నిను॥
దినమైన గడుపలేక – తిరుగాడితి నీవు రాక –
మనసెల్ల నీది కాదా ?–మాటాడ ప్రేమ రాదా?
కనలేక నిముసమైన – కడ తేరనోపజాల ॥నిను॥

ప్రకాశం :–(ప్రవేశిస్తూ)

కరుణాల వాల ! బాల ! కాపాడి నాపైలీల –
కరుణించి బ్రోవు మమ్మ ! కడ తేర్చవా ? శాంతమ్మ !
సురలోక దేవివమ్మా ! శుభమంచు దీవె నిమ్మా

శాంత: ప్రకాశ్ :–నిను బాసి ఓర్వజాల –
మనజాల మానశీల! ॥నిను॥

ప్రకాశం:–సీ॥ పసితనము నుండి మీా పనులలో యెంతో విసి
గించి వేదిస్తి క్షమించుమమ్మ

శాంత :– నీ కష్టమును బొంది నీ కడుపుమాడ్చి హిం
సింతిమి మేమె క్షమించుమయ్య !

ప్రకాశం:— తల్లి ప్రేమను మించు తమ ప్రేమ వాహినిం
తేలియాడించితి విదే నమస్తె!

శాంత:— రేఖుంబగళ్లనక వేయికళ్లతో సేవ
సేయువానిని యెట్లు బాయుదాన

ప్రకాశం:— గీ. విద్య నార్జించ నన్ను దీవించుమమ్మ!
శాంతమా దేవి! శుభమంచు సంతసముతో

శాంత:— శుభము సత్కీర్తి నార్జించి సుఖత రమ్మ
సఖుడ! యెందున్న నన్ను మరువకుమ భువిలో.

ప్రకాశం:— శాంతమ్మా!... యీ ప్రకాశ్ పాలిట స్వర్ణానంద ఝురీ ప్రవాహము. రహోమధుర హేలా ప్రణయ శాలవు. ప్రత్యక్ష దేవతవు. నా జన్మాంతమువరకూ ఈ నా హృదయ కుహరమనే ఆలయన్లో భవదీయ దేవతా స్వరూపాన్ని ప్రతిష్ఠించి-నా ఆనం దాశ్రుకణాల్తో నీపాదాలు కడిగి - నాహృదయాన్నే నారికేళ నివేదనగా బద్దలుగొట్టి - నా ఆత్మజ్యోతినే నీకు హారతిజ్యోతిగా అర్పించి - దైనందిన పూజలుగావించి - సేవించి తరిం చెదగాక. నిన్ను మరచిపోవునంతటి మందుడనా!

శాంత:— (ఆనందాశ్రుకణాలు తుడుచుకుంటూ గద్గదంతో) నీ క్షేమసమాచారాలు స్వామీజీ పేర వ్రాస్తూండు!... నాజ్ఞాపకార్ధంగా యీ ఫౌంటెన్ పెన్ నా కానుకగా అంగీకరించి - యీ రూపంగా నన్ను జ్ఞాపకముంచుకో!

ప్రకాశం:— (మోకరించి–ఆ కానుకనందుకొని – కళ్లకద్దుకుని) ఇక్కడేవుండండి ఇప్పుడే వస్తాను (పరుగిడుతాడు)

శాంత:— పాపం—నాకేదో కానుక నీయాలని ఆవేదన పడ్తూ – ఆతురతతో వెళ్ళాడు ... యేమివ్వగలడా బీదరికన్లో ?... ఆహా... యెంత నిర్మల హృదయం ?... యెటువంటి గంభీర భావాలు ?

గగ్గయ్య:— (ప్రవేశిస్తూ) సర్వనాశనం చేస్తాను... ఇంకావిడిచి పెడ్తానా ?... గుడిశె పీకించడంతో అయిందనుకున్నారు గాబోలు—ప్రపంచన్లో యేమూలం దాక్కున్నా గాలించి యీగగ్గయ్యగారి మజాచూపిస్తా. (శాంతనుచూచి) యేం అమ్మాయ్ ? ప్రొద్దుగూకే వరకూ యీ పూల సంతేనా ?...? లోనికిపోయి స్నానంచెయ్.

శాంత:— నేనొస్తా లెండి నాన్నా ! మీరువెళ్ళి స్నానం చెయ్యండి !

గగ్గయ్య:—యేంవిటే ?—నీవూ జబాబుచెప్తున్నావూ ? ...? ఆసి బడవా ముండా! !... ముందులోనికి నడవ్వేం ? (రెక్క పట్టిలాక్కుపోతాడు)

ప్రకాశం:—(ఆతురతతో ప్రవేశించిశాంతవైపుదీనంగాచూస్తూ) అయ్యో !...నాభ_ కానుక – నా మంగళసందేశం యీ కుంకుమ భరణి అందజెయ్యలేని అదృష్ట హీనుణ్ని

స్వామీజీ:— (ఆతురతతో ప్రవేశించి) యేం ప్రకాశ్? ఇక్కడే నిలబడి పోయావేం? శాంతమ్మదగ్గర శెలవు తీసుకున్నావా?... రైల్ టైమైంది. త్వరపడకపోతే బండిదాటి పోతుంది. (ఇరువురూ వెళ్తారు — అవనిక జారుతుంది.)

## మూడో రంగం

(స్వామీజీ తనకుటీరంలో ప్రయాణ సన్నాహంతో బేగ్ వగైరా సర్దుకుంటుంటాడు.)

దానయ్య : మాణిక్యం:— (ప్రవేశించి) దండాలు బాబయ్యా!

స్వామీజీ:— యే న్నాయనా! యెక్కడున్నారు? యెట్లున్నారు? జగ్గయ్యగారు మిమ్మల్ని చాలవిధాల హింసించి— వూరిబయటికి నెట్టించారనివిన్నా. "పోనీ నా కడుపులోనే దాచుకునేవాణ్ణి యీ కుటీరానికే రాకపోయారా?

దానయ్య:— ఒద్దు బాబూ! ఒద్దు! తానుచెడ్డకోతి—వనమంతా చెరిపిందని మేఁవు మాడిపోతున్నా ఆ మంటల్లో తమర్ని కూడా మాడ్నేయ్ మంటారా? ... ఒద్దు ... మేఁవు తఁవురి దగ్గిరికొచ్చాఁవన్నా కవురా కసాయోడిన్నాడంటే నిప్పులు మీద కోతై పోతాడు.

మాణిక్యం:—బాబూ! మీదయుంటే అంతేసాలు. మాబిడ్డల్ని తఁవురిసేతి కప్పగిచ్చాఁవంటే — ఇంతవరకే — కర్సకే —

రయానికీ – మీబిడ్డల్లాగ సూసు కుంటుండారు. అందుకే యిట్టపడి పోయాం అట్టాగే అడుక్కునీ – పుడుక్కునీ – తింటూ బిడ్డలకోసమన్నా పాణాల్నిలుపుకుంటూం వినాన్నా మొగాన్ని బిచ్చం వెత్తిందాంట్లో మూణ్నాలకానీ మిగుల్చు కొచ్చాం-సాటుగావొచ్చి అప్పుడప్పుడు యిట్టాగే యిచ్చి పోతుంటాం. మా బిడ్డలికి పంపుతూండండి బాబూ!

స్వామీజీ — వీరల్ని చూచి భగ్గున మండిపోయె మన భారత దేశంలో – భిక్షాటన చేసి – బిడ్డల్ని చదివించేందుకు మిగు ల్తుందా ! ... వాళ్లకొరకెలాగూ నేను భిక్షమెత్తుతూనే వున్నా ...పాపం...వస్త్రాలకు చాలాహీనంగావున్నారు. వుంచుకోండి !

దానయ్య:– అదుగో! ... యెవురో వత్తుండారు. మేంపోతాం పుచ్చుకోండి ! (డబ్బులు స్వామీజీకి బలవంతంగా యిచ్చి వెళ్తారు)

శాంత:– (ప్రవేశించి) నమస్కారమండి !

స్వామీజీ:– యేంతల్లీ యిలావచ్చావే ?

శాంత:– తమరితో చాల విషయాలు మాట్లాడ వలసివుంది. సమయంలేదు. ప్రకాశ్-లతల దగ్గర్నుండి జాబొచ్చిందండీ?

స్వామీజీ:– ఈవేళే వచ్చిందమ్మా !

శాంత:– కుశలమేనా ?

స్వామీజీ:— ఆఁ ... కుశలంగానే వున్నారు. నీకు నమస్కా-
రాలు కూడ పంపారు.

శాంత:— (తన్మయాన్ననుభవించి) ఆహా! ... భగవానుడు
దీనుల్ని తప్పక రక్షిస్తాడు. — ఒక్క-ముఖ్య విషయాన్ని
గురించి మీదగ్గర కొచ్చా. మీరిందులకే యభ్యంతరాన్నీ
చెప్పకుండాలని ప్రార్థిస్తున్నా... యేమీ లేదు. ఈ డబ్బును
ప్రకాశ్ కు పంపించండి.

స్వామీజీ:—శాంతమ్మా! నీవు కేవలం బీదలపాలిట భూలో
కన్లో అవతరించిన ధర్మదేవతవు. దిక్కు-లేక అల్లాడి
పోతున్నా దీన ప్రజలపై దయానురాగాల ప్రదర్శించడం
నేను ప్రసంశిస్తాను. గాని...తండ్రి చాటుబిడ్డవు - ఇంత
మొత్తాన్ని-చాటుగాదానంచేయుట-ముఖ్యంగా నాలాంటి
వారిద్వారా పంపయత్నించుట - నేను శ్లాఘించను.
సొమ్మెక్కడ దొంగిలించావో అక్కడే మళ్లీ జాగ్రత్త
పఱచు!... వెళ్లు!

శాంత:—లేదండీ! ఇది అపహృత ధనంకాదు. మాతండ్రి
తోబుట్టువు దుర్గా బాయమ్మగారని మామేనత్తగా
రున్నారు. ఆమె అప్పుడప్పుడు గాజులకని-చిరుతిండులకని-
కొన్ని డబ్బులు పంపుతూంటుంది. వాటిని వృధాఖర్చు
చేయక దాచివుంచా. మీరు సందేహించక పంపించండి!

స్వామీజీ:—చాల సంతోషం. నీవు దొంగతనం చేయలేకపోయిన నేనానందభరితుణ్ణయ్యాను... మీతండ్రిగారిందుకు చాలా వ్యతిరేకులు_ఈ విషయంలో మాత్రం నన్ను బలవంతం చేయకు!... ఒక్క_విషయం స్వాతంత్ర్యం సిద్ధించినరోజునే పల్కిన బాబూజీ స్వర్ణాక్షరా లివిగో విను! "ఒక హరిజన బాలిక అధ్యక్షురాలుకావాలి" ఈ మాటల్లోని అంత రార్థాన్ని నీయాంతర్యంలో వుంచుకో!

దాదా:_(ఆతురతతో ప్రవేస్తూ) శాంతమ్మాఘూర్! శాంతమ్మాఘూర్!! మీకేఖోసం హిందుల్ హిందుల్ హంతా హెత్కీ_మీకీ ఖన్పడా పోయేతల్కీ _ కంసూడ్ షాంతా కసాయ్ హుంచీ_భస్మాసూసుడ్ హంతా బడాయ్ తీసీ_శిశ్పాల్ హంతా శెల్స్రత్తం శేసీ_ఛెంగీక్ హంతా శౌర్యం పెంచీ _ కష్టాసేత్లో హుంచీ_ ఖమ్మాఖులాయించీ_ నడమ్మా భిడాయించీ నాల్కీ_ నడాన్కీ_హూంచీ_నడీహిందుల్ నుంచీ _ నరసిమ్మా _ సామీహేశం హూస్తా హుంఢాద్ హాండీ! జల్దీ హుటో!

శాంత:—ఏమిటి నరసింహస్వామి వేశం యేంటాగొడవ?

దాదా:—మీ నానాఘూర్ హూస్తా హుండార్ హాండీ! జల్దీ జల్దీ.

శాంత:_స్వామీజీ! ప్రస్తుతం సెలవు తీసుకుంటా...నమస్తే! (వెళ్తుంది)

దాదా:—సలాం లేఖో స్వామీజీ! మాకీ తెల్యాపుచ్చుకుంటాం. మీాకీ ఖూశా పెస్తాతం హెక్డొకన్నా తెల్యా పుచ్చుంటే అచ్ఛీబాత్ గగ్గయ్యాఘూర్ హంటే - హగ్గీఘోర్ అన్నా మాట. సలాం లేఖో! (వెళ్తాడు)

గగ్గయ్య:—(ప్రవేశిస్తాడు)

స్వామీజీ:—నమస్కారాలండీ!... ఇలాకూర్చోండి!... పెద్దలు అకస్మాత్తుగా దయచేశారు.

గగ్గయ్య:—మర్యాదలకేగాని - మాలపల్లిని యెంతవరకు నేల మట్టం చేయదల్చుకున్నావూ! అని.

స్వామీజీ:—అసలు సంగతేంటో తెలవియ్యండి!

గగ్గయ్య:—విక్షాపన్లాంటి దానను కుటుంబాన్ని దగ్ధం చేశావు గదా!...నీకెందుకొచ్చిన వెధవ్వేషాలివి? నావ్యవసాయం మీాద మేనేజరుగావుండు! నీవడిగిన జీతమిస్తూ నిన్ను కుబేరుణ్ని చేస్తా... అంతేగాని... ఈమాల మాదిగ కుంకమ్మల చంకల్నాకుతూ...

స్వామీజీ:—బాబూ! కొంచమాపండి!... ఈవిషయాన్నే తమరితో మనవిచెయ్యాలని సమయంకొరకు సహస్రనేత్రాల్తో యెదురు చూస్తూన్నా. తమరిప్పుడు తెలవిచ్చారే! మాల మాదిగ కుంకమ్మలని? వీళ్లెక్కడివారో శాస్త్ర విన్నవిస్తా.

"శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వైశ్యస్త్రయోవర్ణ ద్విజాతయః
చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తితు పంచమః॥"

మనుస్మృతి దశమోధ్యాయన్లో బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య - శూద్ర - యను నాల్గు జాతులేగాని - పంచమ జాతి లేనే లేదన్నాడు మనువు.

"శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టా గుణకర్మ విభాగశః॥"

భగవద్గీతలో గుణకర్మ విభేదాలవల్ల నాల్గుజాతులు నాచేతనే సృష్టింపబడినయ్యన్నాడు శ్రీకృష్ణుడు. పంచమ జాతి లేనేలేదని పదివేల నిదర్శనాలకు తక్కువ లేకుండా చూప గలను. హిందూమత గ్రంథాల్లో పరికించండి!

"శ్లో॥ మతం గాజ్జాతాః మాతంగాః॥"

మతంగ మహాముని సంతతివారే మాదిగలని లింగాభట్టీయన్లో వ్రాసుంది.

"శ్లో॥ జాతో వ్యాసస్తుకై వార్త్యాశ్వ పాశ్యాస్తు పరాశరః॥"

వేదవ్యాసుడు నీచజన్ములైన సత్యవతీ - పరాశరులకు జన్మించాడని భారతం - ఆదిపర్వన్లో వుంది. వ్యాసునకును - వేశ్యకును శుకమహర్షి జన్మించాడని దేవీ భాగవతం-ప్రథమ స్కంధన్లోవుంది.

"శ్లో॥ అక్షమాలా వసిష్ఠేన సంయుక్తాధమ యోనిజా
పారంగీ మందపాలేన జగామభ్యర్హణీయతామ్॥"

మహాపతివ్రత యని పలుజాతులచే పూజింప బడే వసిష్ఠునిభార్య అరుంధతీదేవి ఛండాలాంగన యని మనుస్మృతిలో

వ్రాసుంది. దేవగంధర్వ యక్షసిద్ధ సాధ్యులచే పూజింపబడే ఆదిమహాకవివాల్మీకి యెవరు? ... ఇలాంటి నిదర్శనాలు లక్షలాది చూపించగలను—హిందువులుపూజించే దేవునికే లేని అంటు జాడ్యమీ హైందవులకెలా సంక్రమించిందో అర్థంకాదు. కొరికి రుచిచూచి యిచ్చిన శబరియెంగిలిపండ్లు శ్రీరాముడు భుజించాడు– వామదేవుడను పంచముని యెంగి లన్నమారా గించాడు పాండురంగడు–క్షత్రియాచారాన్ని నిరోధించి విదు రునియింట విందారగించాడు శ్రీకృష్ణుడు– చొకామేళుడను ఛండాలుని యింటభుజించాడు పండరినాథుడు–కాశీకాపురి ఆదిశంకరుడు ఒకపంచముని వల్ల సుజ్ఞానమెరిగి సాష్టాంగదండ ప్రణామ మాచరించి నట్లు శంకరవిజయం విశ్వేశ్వరపర్వన్లో వుంది.–సులోపి–రోహిదాసుడు–శఠగోపుడు–నందుడు– యెంద రెందరు భక్తుల్లేరీ పంచముల్లో?—బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేయగల్గిన విశ్వామిత్రుని కుమార్తెలుగారా మాలెతలు? భరతఖండమని పేరునిల్పిన భరతుని తల్లి శకుంతల విశ్వామి త్రునివల్ల వేశ్యకుకాదా జన్మించింది?

శ్లో॥ జాతిః పూజ్యా తేరాజన్ గుణః కల్యాణకారకః
చండాల మపి వృత్తస్థం దేవ బ్రాహ్మణం విదుః॥"

జన్మతో మానవులంతా ఒకేజాతి. దేవతలలోగాని – బ్రాహ్మణులలోగాని – గుణములవల్ల కులహీనులుగా మారు తుంటారని భారతం – ఆది పర్వన్లో వ్రాసుంది – ఇదేకాదు–

శతపథ బ్రాహ్మణం - భగవద్గీత - భారతం - రామాయణం - సంఖ్యాశాస్త్రం - బృహదారణ్యకోపనిషత్తు - అన్నీ చెప్పే సిద్ధాంతమేయిది.

గర్గయ్య :- చాల్లేవోయ్ వెంకటప్పయ్యా! ఇకచాలు! నీ వేదాంతాన్ని సరిపెట్టి - నే నడిగిందానికి సరైన సమాధానం చెప్పు! ... యీ కోతి కొమ్మచ్చాటలు సరిపెట్టి - వుద్యోగ మిప్పిస్తా చేసుకుంటావా? లేక ... నావల్ల వచ్చే బహుమానాలు స్వీకరిస్తావా?

స్వామీజీ :- తమరు నాకొరకేమీ శ్రమపడనక్కర్లేదు. నేను బియేఫస్టుక్లాస్‌లో పాసయ్యాను. యల్. యల్. బి, పాసయ్యాను యం. బి. బి, యస్ పాసయ్యాను. ఉద్యోగం కావాలంటే - నాకునేను సంపాదించుకోగలను. అయినా నౌఖరీ చెయ్యాలనే అంతటి అగత్యమూ లేదు. పాలీనా పదివేల రూపాయిలు రాబడిగల స్థిరాస్తికూడావుంది. అవన్నీత్యజించి - నావుద్యోగం - నాదీక్ష-నాభుక్తి-నాముక్తి -నాశక్తి-నాసర్వస్వమూ దీన జన సేవాకైంకర్యం చేయ నెంచాను. తమరు ప్రాజ్ఞులు - విజ్ఞాన సంపన్నులు - నేను విన్నవించ దగ్గావిశేషాలేమీ వుండవని తలస్తాను. ఈలోక గౌరవ వైభవాలనే పరమావధిగా నెంచుకుంటున్నారు. పారమార్థికాన్నిమాత్రమూ పాటించడల్లేదు.

గగ్గయ:— నా పారమార్థికాన్ని గురించి నీ వేమీ మొసలి
కన్నీళ్లు కార్చనక్కర్లేదు – చర్చిలు సానుభూతులు చెప్ప
నక్కర్లేదు. ఆఖరి సంగతి నడుగుతున్నా నీ హరిజన సేవా
ప్రచారాన్ని మానుకుంటావా ?— ఈ గగ్గయ్యగారి
గరమనాళా చవిజూస్తావా ?

స్వామీజీ :— క్షమించండి !—

గగ్గయ్య:— ఇక విరమించండి !

వ. నిజముగ మా సనాతనము నింగి జెలంగెడు భంగి లేక నా
విజయముల బాహువిక్రమము వీరవిహారము చేయుచుండినన్
విజితులు గగ్గయాన్వయము వేనకువేలుగ నేలనీని యీ
కుజనులమాలమాదిగలగూల్పగనోర్తుమెయింక గాంచుమా.

(నిష్క్రమిస్తాడు – అవనిక జారుతుంది)



# న వ యు గ ము

[సాంఘిక నాటకము]

## నాలుగో అంకం — మొదటిరంగం.

ప్రకాశం :—(తన గదియందు యేకాంతంగా జిజ్ఞాసతో)

పా ట.

భారత మహిళా మహిమను జాట
భాగ్యదేవతవుగావే ? స్త్రీ
భావము + బ్రోవగనీవే ! ॥భారత॥
హరిజన + పెన్నిధి నీవే ! రావా ? గావ
దర్శనమీయగలేవ ? మా
భారము నీదిగా భావించితివా ? —
మరువగతరమా ? దేవీ ! ॥భారత॥
కరుణ మాని నీ కన్నతండ్రియె
కఠినముగా హింసించెనుగా
పరమార్థముకే ప్రాలుమాలితివా ?
పాలితదేవిగా వెలసితివా ! ॥భారత॥

సీ. పస్తులన్ కృశియించు భారతీయులపైని
కస్తూరిమాతకు గలుగు ప్రేమ
మరణవస్తనుగుందు మా దీన ప్రజలపై
అరణ అసఫాలిలో అలరు ప్రేమ

కుజనాళి మధ్యలో కుమిలెడు జనులపై
విజయలక్ష్మికి గల్గు విశ్వప్రేమ
రోగపీడితులయ్యు రోదించు నరులపై
రాజ కుమారిలో రగుల్పు ప్రేమ
మించి లెక్కించు సుపవిత్ర మిత్రప్రేమ
గాంచ గల్గితి ధన్యుడనె కరుణాలోల!
శాంతమాదేవి! శుభశీల! శాంతిబాల!
భక్తి నర్పింతు జోహారు భాగ్యమాల!

సూర్యం :—(ప్రవేశించి) యేంవిటోయ్ ప్రకాశ్ ?... యేంవిటా జిజ్ఞాస? ఎప్పుడుచూచినా పే...ద్ద సింగినాదం సీరియస్‌గా వుంటావేంటోయ్!

ప్రకాశం :—యేంవీ లేదు సూర్యం.

సూర్యం :—అదేంటి ప్రకాశ్ ?... నేను నీమిత్రుణ్ని— నీయూష్ట మిత్రుణ్ని— నీ ఆంతరంగిక మిత్రుణ్ని— నీ ఐశ్వర్యన్నో— ఆరోగ్యన్నో— ఆనందన్నో— అహోరాత్రాలూ పాల్లు పంచు కుంటున్నానే— నీ యూ వేదనచూస్తూ యెంతకాలం యెలా వూరుకోగలుగుతాను ?...నాకు చెప్పవూ ప్రకాశ్ ?

ప్రకాశం :— యేంజెప్పను సూర్యం !

సూర్యం :— చెప్పు ప్రకాశ్! యేంటి నీయూలాపన? ...ఎప్పుడూ ఆ కలాన్నలా కళ్లకద్దుకుంటూ కలవరిస్తూ వుంటావ్... యేంటా కలం కథ ?

ప్రకాశం :— కలం కథ...కలం కథ చెప్పాలంటే—నాగొంతు డగ్గుత్తికమై—నోటినుండిమాటరాకపోవడమేగాక—ఉఛ్ఛ్వాస—నిశ్వాసలుగూడా బంధించబడతయ్యోయ్ సూర్యం ఇంకా యెలా చెప్పను! నీవు గట్టిగా యీ కలం కథ వినాలంటే—నాకన్నీళ్లు చెంత నీకర్ణాలుంచిన—ఆ కన్నీటి ఘోషలో నీకా కథ అర్థమౌతుంది.

సూర్యం :— క్షమించు ప్రకాశ్! ఇంక యీ ప్రసంశనే యెత్తనులే...సరికాని ప్రకాశ్! వారం వారం యం—ఓ—చేస్తుంటాడు యెవరా దాదాసాహేబు? మీ నాన్నగారి మిత్రుడా!!

ప్రకాశం :— మానాన్నగారి మిత్రుడుకాదు — నాప్రాణానికి మిత్రుడు—నాజ్ఞానానికి మిత్రుడు—నాధ్యానానికి మిత్రుడు—నా సర్వస్వానికీ మిత్రుడు. నాకుడబ్బుపంపేది దాదాసాహేబుగారు కాదు—భూలోకమున నాకొరకవతరించిన దేవత. సకల మానవ రక్షాదక్ష సార్థకులగు రైతుబిడ్డయై రగిలి—ముక్త్యావేదనావ్యక్తియై—భక్తావేశమున ప్రబలిన భక్తిమాల మాలాలంకృతయై—మాలపోలడ నగు నాకాలవాహినింగడ తేర్చిన నాకాలచక్రము చక్రవేగంబున వక్రమార్గావలంబినై వృధా వ్యధనొందు నన్ను ఉదార సుధారసలీల ముదితయై ఉన్నత విద్యా భాగ్యదాతయగు సుహృద్భావ భువనాతీత భావయుక్తా దేవత దేవతావైభవంబుచే కను

లారా కన్నాంబ అంబా ప్రతిభావిశేషమున శాంతా కుమారి శాంతనామాకృతిగల్గి సౌందర్యమున సహస్రకిరణ సూర్యకుమారి సూర్యానేకరాజన్య చూడామణులు కాంక్షించు కాంచనమాల కర్తవ్యమాల-కావ్యమాల-కృషిమాల-గుణమాల-స్వచ్ఛందశీల-యగు శ్రీ శాంతా మాలాబాల నాకు డబ్బుపంపేది. ఈ కల్లాసిక్యూ-డాకథా నాయకురాలా మేనోయ్ సూర్యం!

సూర్యం:— యేంటిటో... నాకిదంతా అరవసోదికన్నా అబ్బో ఘుంఘూ అర్థమైంది... సరికాని...

పోష్టుమేన్:— పేపరుసార్!

ప్రకాశం:— సూర్యం! పేపరు. ఈవేళే బి. యే. రిజల్ట్సు వస్తయ్

సూర్యం:— (పేపరు తెస్తాడు-ఇరువురూ ఆతురతతో చూస్తారు.) నైన్ ట్వంటిఫోర్ ... ఒకే!!

ప్రకాశం:— ఓకే!! దిస్సీజ్ మైనంబర్. నైన్ థర్టీఫైవ్ ... జైహింద్!

సూర్యం:— జైహింద్!

ప్రకాశం:— టూనాట్ ఫైవ్ నంబర్ చూడవోయ్!

సూర్యం;— (పరిశీలిస్తూ) ఆనంబరేనా మిస్సిస్టర్ లలితది? ... ఇదిగో! టూనాట్ ఫైవ్

ప్రకాశం:— వెల్ సిస్టర్! వెల్! ...సూర్యం! ముగ్గురమూ ఫస్టుక్లాస్ బి. యే. ... తాతా! గాంధీజీ!! ఇది నీయాశీర్వాదం కాదు?...!

చ. పరమసుధార్ణ వేద్య ఘనభక్త శిఖాగ్రమణీ! సమగ్రణీ!
నిరత మహోజ్వలోద్ధ్వని! వినీలిత నేత్ర సమాని! శాంతినీ
కరమునబూని నీసుఖ వికాస సుశేష యశో విశాలతన్
కరుణను నిల్పి సేవకుల గావుమ! దేవ! సుభావ! గాంధిజీ!

సూర్యం:— వాళ్లంతా యేడ్చినట్లే—మన నంబర్లుకూడ ఒక్క—చోటే రావడం చూడు!

ప్రకాశం:— వాళ్లంతా యేడవడం వేఁవిటి? యెవడా యేడ్చేది? ...అసలు యేడవమెందుకూ అని.

సూర్యం:—రోజురోజూ వీళ్లగోల జాస్తైపోతుందోయ్ ప్రకాశ్! వీళ్లకు తగిన శాస్తి చెయ్యకపోతే వీల్లేదు.

ప్రకాశం:— యేఁవిటాగోల?

సూర్యం:— నీవు మాలవని—నేను మాదిగనని—మనమిద్దరం భేదాభిప్రాయాలు లేకుండా కలిసిమెలిసి వుంటున్నామని.

ప్రకాశం:— అవును...వీళ్ళకాదు బుద్ధిచెప్పేది...మనకు మనమే బుద్ధిచెప్పుకోవాలి. ...ఒక్క—దేహంలోవున్న రెండవయవాలకే ఐక్యంలేకపోతే — విరోధిమీాదయుద్ధమెలా? ఇంట గెలవనిదే— రచ్చనెలా గెలిచేది?...మాల మాదిగ—అనే భేదాభిప్రాయాన్ని సమూలంగా నాశనం చెయ్యాలి. అనాగరికులై — అజ్ఞానులై—అవ్యక్తులై—అలమటిస్తున్నా అశేష హరిజన ప్రజానీకాన్ని ఆదరించడానికి—అయోమయలోకాన్నుండి అంతర్వీధిలో — ఆనందవాయుకెరటాల్లో — వూగా

డించడానికి —ఆధ్యాత్మిక తత్త్వవేత్తలుగా అభిషేకించడానికి ధీరోత్తంసులమై నిలబడి— పసుపుకంకణాలను మరంకట్టాలి. ఇందుకే మంటావ్?

సూర్య్యః—మిత్రమా!! నేడోయ్ నిన్నుశ్లాఘిస్తున్నాను. ఐక్యభావాలతో ఐక్యకంఠాలతో—అహర్నిశలూ అలమటించిదియైనా—ఆదర్శప్రాయులమై— ఆశాకిరణాలమై— అధఃపతితులైన—హరిజనోద్ధరణకు—... ఆగాగు! పసుపుకంకణాలు తెస్తా(లోనికి పోయి కంకణాలు తెచ్చి) చెప్పు! నీ ప్రతిజ్ఞ యేంటో!

ప్రకాశం:—ప్లానులు ముందు — ప్రతిజ్ఞలువెనుక మేధావంతుల లక్షణం. చెప్తున్నావిను! మన మాల—మాదిగ పల్లెలమధ్య ప్రవాహవుటేరు మెలికలో ఐదువందల యకరాలభూమి వుంది తెలుసా?

సూర్య్యం:— అవును వుంది.

ప్రకాశం:— ఆప్రవాహానికి స్ట్రేట్లైన్ త్రవ్విస్తే—పరుదంతా జారిపోతుంది—బంజరీ అంతా సాగౌతుంది.

సూర్య్యం:— వెరీగూడ్ యెమ్డన్ స్కీమెత్తావోయ్. ఆబంజరీ మంజూరుచేయించి — ఉభయగ్రామాల — మాల—మాదిగలకూ సమానంగా పంపిణీలు చేయించామూ అంటే — ఆ యీ—జాతి అనకుండా ఐక్యకంఠంతో ఆనందభైరవి ఆలాపన చేశారన్నమాటే... ఆల్ రైట్ యీవేళే అప్లికేషన్

పంపించేద్దాం. ఇందుకైనా వుపయోగిస్తుంది. నేను ఇంజనీరింగ్ కోర్సుకెళ్తానోయ్.

ప్రకాశం:— నేను అగ్రికల్చర్ డిమాన్‌స్ట్రేటరు.

సూర్యం:— మరి ... మీ లత?

ప్రకాశం:— ఆమె ప్రజాసేవలో మనకన్నా పక్కా—చెయ్యి. అందుకే ఆమెను యం. బి. బి. యస్.కు వెళ్ళమని వ్రాస్తా.

సూర్యం:— అవునుగాని ... పిల్లికి గంటెలా కట్టేది? అన్నట్లు యేటిమొలికకు స్ట్రెయిట్ లైన్ చెయ్యడానికి డబ్బెలాగోయ్? కోడిగ్రుడ్డుతో సంపాదించదలచిన గేదె యీనితే మజ్జిగ మీవాళ్ళకుపోస్తానంటావా? అనిసంతబజారు చేశాడంట యిల్లంతాను అలావుంది మనానందం.

ప్రకాశం:—దానికీ ఒకయెత్తు యెత్తేవుంచా. ఆభూమిని సేద్యపరచుకునే వాళ్లే ఆస్ట్రెయిట్ లైన్ త్రవ్వాలి. వారిజీవనానికి పాదికై ప్రభుత్వం అప్పుపెట్టాలి. సదరు ఋణాన్ని వాయిదాల ప్రకారం తీర్చుకోవాలి.

సూర్యం:—ప్రభుత్వం పైసాకూడా బయటపెట్టనంటే — అప్పుడేంగావలి? త్రాడుతెగి — తప్పేళా పగుల్తుందే.

ప్రకాశం:—సూర్యం! ఇక్కడే మనం త్యాగంచేయ్యాలి. మనముగ్గురమూ వెళ్తున్నకోర్సులు పాసయ్యామా అంటే — ఉద్యోగాల్లో ప్రవేశిద్దాం.

సూర్యం:—సడీ... పోయిందిలే ... వుద్యోగాల్లో ప్రవేశిస్తే — వుళ్లో వార్తలైనా వినడానికి తీరికుంటుందా? అని.

ప్రకాశం:—అవును. నీమాటకాదనను. గాని — మనం కేవలం హరిజన సేవార్థంకర్యార్థం ధనంకొరకు మాత్రమే ఉద్యోగాల్లో ప్రవేశిద్దాం. మనమంగ్గరికి సగటున నెలకు వెయ్యి రూపాయిలు తప్పకవస్తయ్. పల్లెటూరి బడిపంతులు యెల్లమార్చుకునే రీతిగా మనమూ యెల్లమార్చుకుందాం, రెండేళ్లలాచేశామూ. అంటే — మన ప్రయత్నాలు సఫలీకృతమైనయ్యన్నమాటే

సూర్యం:—ఓకే !!... ఆజాత్యైక్యతకూ — జాత్యోద్ధరణకూ... నీ ప్రతిజ్ఞ

ప్రకాశం:—

శా॥ వీరాగ్రేసరు లాంధ్రభక్తులు ఘనుల్ విఖ్యాత విశ్వప్రభా
కారుణ్యాంబుధు లాంధ్రకేసరియు రంగారైతు పట్టాభి ప్రే
రే రామామణిరత్నగర్భసుఖతన్ యేతెంచెనాయాంధ్రమా
తా రాజేశ్వరి పాదసాక్షిగను నేనార్జింతుజాత్యైక్యతన్॥

సూర్యం:— నాప్రతిజ్ఞవిను !

సీ॥ స్వర్ణాక్షరపునేత స్వర్గగాంధీ తాత
పరలోకదీవెనల్ బంపెనేని
వీరజవ్వారిలాలు విజయ భేరీలలో
స్వైర విహారంబు సల్పుదేని

ప్రజ్ఞాధురంధరుడు పటేలు సర్దారు
సైన్యాన జై! యంచు జరుగుదేని
జయ ప్రకాశము ఢంక జగము జలనిధులింక
రంకె లేయుచు భువిని రగులునేని
గీ॥ ఉడుకునెత్తురు నాలోన వురికె నేని
మాల - మాదిగభేదము మంటగలిపి
అంటు జాడ్యము నావలగెంటువరకు
బ్రహ్మచర్యము దీక్షనీ - పాదసాక్షి॥
(ఆనందంతో యిరువురూ కౌగలించుకుంటారు
అవనికజారుతుంది)

## రెండోరంగం

(గగ్గయ్యగారి గృహావెలుపలి భాగము)

దాదా:—(హనుమంతురావు సామాను లోనికిచేరవేస్తుంటాడు)
హనుమంతురావు:—(ప్రవేశిస్తూ) పాట:—
ముసలి ముండ లంతా_ముత్తైదులౌతాపు
పడుసోళ్లు పట్టీలు కొడతారురా! గుడుడ!॥
నందామురా! బ్రహ్మం_నందామురా!
ఆనంద దేవికి నందామురా॥
దాదా:—(తిరిగీ ప్రవేశిస్తూ)అరె! హేట్టిూ మస్నీ హలుండాద్యా
యాృానీకీ! ... ధూ!!...ఖోతిమన్సీ!... హేట్టిూ పు:ణ్యా-
పుట్టాకీబే నీకీల్!

హను:—మాం వయ్యా!!...మాంవయ్యో !!! ... వీడు చూడు తిడ్తున్నాడు!

శాంత:—(ప్రవేశిస్తూ) ఇశ్! ...గోల... యేంటివాదా?

హను:—(శాంతనుచూచి అదిరిపడి మోహ వికారపు చేష్టలు చేస్తుంటాడు)

దాదా:—నూడ్వమ్మా! యీసోంబేర్ వాలా ... ముసిల్ హోళ్ళ—పెల్లి సేస్తాడ్ హంట...

గగ్గయ్య:—(ప్రవేశిస్తూ) నిన్ననే వస్తావని యెదురు చూచాం ప్రయాణం సుఖంగా జరిగిపోయిందా??

హను:—ఆఁ...సుఖంగానే వచ్చాం మాంవయ్యా!... సామానంతా సర్దుకునేఁసరికి సూర్యాస్తమయమయ్యింది. అందుకే యీవేళ ప్రయాణం పెట్టాను.

గగ్గయ్య:—సరే... వెళ్లీ స్నానంచెయ్! ... (నిష్క్రమిస్తాడు)

హను:—(శాంతవైపు వెఱ్ఱిగాచూస్తూ వికారపుచేష్టలుచేస్తూ వెల్తాడు)

దాదా:— హేమ్టీ హమ్మా శాంతమ్మాఘూర్? యీ సైతాన్‌వాలా హిక్డా శేరిందీ?? ...

శాంత:—అవునుదాదా...నా పవిత్రాశయాన్ని భంగపరచడానికి నా పాలిట సైతానుగానే సమావేశమయ్యాడు. ఈయన మామేనత్త గారికుమారుడు. తల్లిదండ్రు లిద్దరూ మరణించారు. వాళ్లుపోయేటప్పటికి యీహనుమంత్రావు

మైనరైనందున యీయన తాలూకు యిరువైయేను వేల రూపాయిల ఆస్థి పిన్నబ్బల పరంగా వుండిపోయింది. ఇప్పుడు మైనరు వెళ్లింది– యీకోతి మొగమూడికిచ్చి పెళ్లి చేసి–ఆ యాస్థంతా కాజెయ్యాలని మానాన్నగారు పిన్నికక్కడికి రప్పించారు. ...దాదా!...నాకు పరీక్షాసమయం ప్రవేశించింది. యేలోకోత్తమ కార్యసాధనకై లోకమాన్యులంతా యేకదీక్ష సాగించారో – యేమహత్తర కార్యసాధనలో మహాత్ముడు తన నిండు ప్రాణాలబలిగావించాడో – అట్టి విధోత్తమజాత్యైక్యతాసాధనకు ప్రాణాలైనాబలిగావింపసిద్ధపడ్డాను. అందు కుపకరణంగా చిన్ననాటినుండీ సద్గుణసంపన్నుడై ప్రకాశించిన ప్రకాశ్‌ను పెళ్ళాడి ప్రపంచానికి ప్రత్యక్ష సన్మాతృకను ప్రదర్శింపనెంచాను.

దాదా:– భాప్రే! ... శాంతమ్మాఘూర్! మీకీ నానాఘూర్ హీనన్నార్. హాంకే మీకీ–మాకీ–హాంతా మర్గయ్

శాంత:–నీవేమీ భయపడనక్కర్లేదు. మనభారతావనిలో మహనీయులు – ఉదారులు – స్వార్థత్యాగులు – యెంత మంది నానాజాతి నిర్మూలనానికి కారణభూతులుకాలేదు?

సీ. ఆర్య వైశ్యుండయ్యు హరిజనుండై తాను
కాంతిచెడిపోయెనే? గాంధితాత.
తన పుత్రికను వైశ్యతనయున కిచ్చి రా
జాజి విశ్వాస పూజలనుగొనడె?

అంబేద్కరుని పెండ్లియాడిన బ్రాహ్మణ
 యువతి వంశీయులు స్థవముచేసిరె ?
గోపరాజులవారు కోరితన కూతును
 మాల యువకునకిచ్చి మాన్యుడవడె !
విభు లసంఖ్యాక వర్ణాంతరపు వివాహ
ములను చేసియు మాన్యులు ముక్తిగనరె ?
యేటికెపుడిది మానాన యేమిసేయు !
విజయమో – వీరస్వర్గమో – వెదకుజాన!

దాదా:— హేట్మో హమ్మా సెప్తార్–మాకీ క్యామాలుం ? మీకీ హిష్టం మాకీ హొఖ్ఖామాత్రం ఖరాబ్ సేపించా హొద్దు. (వెళ్తాడు)

శాంత:— (ఆలోచనా వి మగ్నయై కూర్చుంటుంది)

దాదా:— (ప్రవేశించి) హిగ్గో! జాబూ హొచ్చిందండీ! (జాబునిస్తాడు)

శాంత:— (జాబు చదువుకొని) దాదా !! చాలా కులాసాగా వున్నారట. యీ వేళతో పరీక్షలు పూర్తవు తయ్యాట.

దాదా:— పొద్దాకా పరిచ్చల్ – పరిచ్చల్ – పరిచ్చల్ ... హేట్మీ పరిచ్చల్ హొండీ ? ఖొంపల్ కూల్చే పరిచ్చల్

శాంత:— దాదా ! యీ పరీక్షలో పాసైతే – వ్యవసాయ శాఖాడైరెక్టర్. నెలకు మూడువందల రూపాయలజీతం – గజిటెడ్ ఆఫీసరుపదవి... తెలుసా ?

హాను:— (లోపలనుండి) దాదా! ... దాదా!!

దాదా:—చోటాబాబూ బులాతాహై — మై జాతుం. (వెళ్లును)

శాంత:—పాట

హృదయమా!! ... ముదమాయెనుగదే! ...
కదురుగల్గినదే! ... ||హృ||
ఉదయించుగదే — నీలోజ్యోతి
కుదిరించగదే — నాలోఖ్యాతి
సొదరించగదే — యీ యువనీతి
పదిలపడుచు స్త్రీజాతి ||హృదయ||

హాను:—(ప్రవేశిస్తూ)

ఒహోహో! ఒహోహో! హో!హో! మరదలా!!
రారమ్మా ఒకముద్దిమ్మా! ||ఒహోహో!||
నన్ను ప్రేమించవే! — ఓ మరదలా!
నినుచేరగనీవే! — నా మరదలా!
అనుమానించావంటే — ఓ సఖియా!
ఆవులించి మింగేస్తా — నే భార్యా! ... ||ఓ||

శాంత:—ఏయ్! ... నీకేమైనా మతుందా??

హాను:మతీ? ... ? ... మ — తి — ... మతంటే? ... మెదడు ... అదెక్కడుంటుంది? ... తలకాయలో ... తలకాయ యెక్కడ? — మెడకాయమీద ... ఆఁ ... చూచుకోనియ్! (జేబులోని అద్దాన్నితీసిచూస్తూ తల — మెడ — సవరించు

కుంటుబ్రా) ఆఁ... ఇదిగో!!... నాకు తలకాయయుంది...

పాట. మా మరదలు గుడ్డిది - నాకుతలకాయ లేదన్నది.
గుడ్డోడు - కుంటోడు - గుళ్లోకి వెళ్తుంటె
గూనిమీ ద్దన్నింది - గుడిసేటిది॥
సోగ్గాడే - చిన్నినాయన -
సగంకాలమన్నా తీరదామె - రావుగాడికి॥

శాంత:—ఓహో భగవానుడ! శ్లాఘనీయమైన నీ శృష్టిలో ఇలాంటి చవటాలనుకూడా నిర్మించావా?

హను:—నీ కొరకే.

శాంత:—నాకొరకా!... యెందుకు!

హను:—నిన్ను - వివాహంబు గావించుకొనుటకు.

శాంత:—నీ మొఖం

హను:—నా మొఖమా!... నా మొఖంలో - నీమూతి - నీమూతిలో - నాముద్దు. కాండబ్బా బాకీ...

శాంత:—(వాని తెలివితక్కువ సంభాషణకు నవ్వుతూంటుంది)

హను:—ఆఁ... నవ్వింది నవ్వింది మారాజ్॥

(కౌగలించుకొనబోవ - శాంత చెంపపెట్టుపెడ్తుంది. కూర్చొని యేడుస్తూ) మాఁవయ్యా! మాఁవయ్యా!! ... మరే... శాంతే... నన్నే ... గూజే ... అదిరిపోయేటట్టు కొట్టింది... అని చెప్తానుండూ ... అప్పుడే అయ్యిందనుకున్నావా?... ఉండమ్మా! వుండూ!

శాంత:—చెప్పితే చెప్పావుగానీ ... ఆ ... బె చాద స్తంగా వాగక వెళ్లు !

హాను :—(లేచి వెళ్ళబోయి వెనుకనుండి శాంతిను గట్టిగా కౌగలించుకుంటాడు).

శాంత :—అమ్మో ! దాదా !!... దాదా !!! (కేక లేస్తుంది)

దాదా :—(పరుగిడివచ్చి శాంతను కౌగలించుకునివున్నా హనుమంతా్రవును రెండు తోములు తోముతాడు)

హాను :—(శాంత చెంగుచాటున దాగుతాడు).

దాదా:—బద్మాష్ వాలా ... హాంత మదం సేసిందోయ్ నీకీ! ... హాడ్తోక్కీ—మీదా దాపడ్తావ్? ... హడ్డం తెగండి శాంతమ్మా ఖాన్! యీ హిబాసారీ హెద్వాయ్‌కీ ముఖలోప్లా కుంఖుం రంగు ధడ్ ధడ్ హన్పిచ్చాలా (మళ్లీ కొట్టబోతాడు)

హాను:—మాఁవయ్యో!... ...మాఁవయ్యో!! చంపేస్తున్నాడు మాఁవయ్యో !...

గఙ్గయ్య:—(ప్రవేశిస్తూ) యేఁవిట్రా గోల ?... యెప్పుడూ యీ దాదాగాడితో యిల్లంతా గోల—రద్దిని ... యేఁవిటేఁ అమ్మాయ్ అల్లరి ??

శాంత:—యేఁ...దో... క్రొత్తరకం పురుగు ... మీదవాలింది నాన్నా! అందుకు భయమేసి కేక లేశాను— అందుకు వీళ్లూ కేక లేస్తున్నారు. అంతే...

గఙ్గయ్య ;—ఇందుకేనా యిల్లంతా అల్లరి ! పోయిస్తానంచెయ్

శాంతి ;—(నెమ్మదిగా విష్కృమిస్తుంది)
గర్గయ్య ;—(శాంత వెనుక వెళ్తాడు)
హాను ;—(తూగుతూ బెదురుతూ వెళ్తుంటాడు)
దాదా;—బతికిపోయావే బేగా!! (మరియొక ప్రక్కకు వెళ్తాడు)

(తెరవాల్తుంది)

## మూడోరంగం

(ప్రకాశ్‌సూర్యం‌మకాం వున్నగదిలో యేకాంతంగా ఆనందంతో)

లత :— పాట :—

ఆహా! ధన్యులమైతిమిగా—అహో! ఓహో! ॥ఆహా॥
ఊహాసౌధములో మేము త్రిరులుగా అహో! ఓహో!॥ఆహా॥
సహోదరుని చేరి—యూ—మహాయశము మీరి—
సహాధ్యాయు సహారాతో హరిజనోన్నతిని గోరి ॥ఆహా॥
కటడు గట్టుకున్న మా హరిజన దుర్నీతులున్న
కటకు ఖడ్గములను చూసి—నటికెదమెద దయను బాసి॥ఆహా॥

సూర్యం :— (ఆటపరికరములతో ప్రవేశించి — లతనుచూచి — నిర్ఘాంతపడి) ఓం!... లతా... దే... వి... గా... రు...
లత :— నమస్తే సూర్యం!
సూర్యం :— నమస్తే !... యెప్పుడు...
లత ;— యేం ? అలానిర్వాణులై శిలాప్రతిమగా మారి పోతున్నారు ?

సూర్యం :— అవును లతా !... నీ జగదేక మోహనాకారాన్ని
చూచి—యే మానవ మాత్రుడు శిలాప్రతిమ కాకమానాడు?
చిరకాలమైత్రిచేసిన నేనే...

లత :— యేం ? స్ఖలితమైపోతున్నారా ?

సూర్యం :— స్ఖలితంకాదు—అనంత వాయుకెరటాల్లో మిళితమై పోతున్నాను.

లత :— సడీ ... పోయిందిలే ఇంజనీరింగ్ కోర్సేపాసయ్యా రనుకుంటున్నాను దానితోపాటు ప్రకృతిసార్సుకూడా కంప్లీట్ చేశారన్నమాట

సూర్యం :— కాదు లతా! నీకు నేత్రాలుంటే నాహృదయ కుహరన్లో యే పవిత్రరూపాన్ని ప్రతిష్ఠించి పూజిస్తున్నానో చూడు! – నీకు చెవులుంటే నాప్రతిరక్తాణువూ—యే పవిత్ర నామాన్ని జపిస్తున్నవో విను ! నీకు ...

లత:— ఆగండాగండి !...లోపలున్నా ప్రతిమను చూడలేను గాని—రక్తాణువు లేమంటున్నయ్యో కాస్త విననివ్వండి (సూర్యంచాతిపై చెవినానించివింటూంటుంది)

సూర్యం :— (స్త్రీస్పర్శవల్లతన్మయంతో లత తలనిమురబోయి వెనుకాడుతాడు)

లత :— (గ్రహించి) దేహం లతను కౌగలించుకోబోతుంది— హృదయం బ్రహ్మచారి—బ్రహ్మచారి—అనిఘోషిస్తూంది.

సూర్యం :— (తృళ్లిపడి దూరంగానిలబడి) లతా!! నిర్మలమైన

ప్రేమ నా పవిత్ర హృదయములో నుండి పొంగి పొర్లుచున్నది అంతే.

లత :— అయితే యీ జబ్బు యిలా కూడా ప్రకోపించవన్నమాట...
అలా అయితే హాస్పటల్‌కి పంపించాల్సిందే.

సూర్యం:— అదేమిటి?... హాస్పటలేంటి?—జబ్బేంటి? ...

లత:— జబ్బేంటా?

సీ. క్లాసులో లేడి టెన్నిసులో లేడి యని
వెరైటీ ఫేసుల వెదకువారు
సోకు సూట్లను వేసి కోకప్రపంచ్చాన
బోకును హారన్ను పూజ్యవరులు
ట్వంటిఫోరవర్సు యింటి కెదురుగ జేరి
తంటాలు పడి స్లోగ తారువారు
ఎఫెక్ట్ ఛాన్సుకై యీవినింగులయందు
పార్కులో సన్నగా కూర్కువారు
స్త్రీల పేరెండ్ల కోరుకుగా శెల్ఫుగా నె
డిన్నరుల కెల్ల చేరుకొను చున్నవారు
ఎవ్రి బ్యూటీ ఫిగర్ వెనుక యేగువారు
ఉంటు వున్నారు పర్సెంటు నైంటి నైను.

ఈ పర్సెంటేజీలో తమరొక పేశెంటని— ఇలాంటి పేశెంట్లు
ప్రతిజ్ఞలు పాలిస్తారా? అని.

సూర్యం:— అయితే నేను ప్రతిజ్ఞను పాలింపనంతటి కృతఘ్నుడ
నను కుంటున్నావా?

లత:— మరే మనుకోమంటున్నారు?

మూర్త్యం:— లతా!!...యిటువిను!

చ॥ నిజమగు దేశనాయకులు నెహ్రూ పటేలు అజాదులాదిగా
విజయాల గన్న భారతికి వీరకుమారుడనేని మేనిదా
నిజకుల వేడిరక్తమును నేలను కార్చిన కార్తుగాని నే
విజయముగాంచకున్నయని వేడుక చచ్చినముక్తిగాంచెదన్.

లత:— ఆనాడు హైస్కూలు ఫస్టు మార్కు—లెయ్యడం మెడలో హార మెయ్యడం.

ప్రకాశం:— (ప్రవేశిస్తూ) చెల్లీ!!

లత:— (ఆతురతతో) అన్నయ్యా!!...అన్నయ్యా! (వక్షముపై వ్రాలుతుంది)

ప్రకాశం:— నా చిట్టితల్లీ!... యెప్పుడొచ్చావమ్మా?...పరీక్షలు అవడంతోనే రాలేదేం? జాబుకూడా వ్రాయలేదు. కోప మొచ్చిందా?

లత:— లేదన్నయ్యా! పరీక్షా ఫలితాలు తెలిసే వరకూ రావద్దనుకున్నాను. నీవు అగ్రికల్చర్ యెగ్జామినేషన్‌లో ఫస్టుని పాసయ్యావని— మా హాస్టల్ పిల్లలంతా విందుచేసి—నాకు దండలేశారన్నయ్యా!

ప్రకాశం:—అవునమ్మా! వేస్తారు. నీవు ఎం. బి. బి. ఎస్. పరీక్ష పాసవడం— యిప్పుడు నా కళ్ళతో చూచి — నా చెవుల్తో వినాలి— నీకార్యదీక్ష—నీ శీలసంపత్తికి — ...అమ్మ ...నాన్నవుంటే—

లత:—(దుఃఖపూరితయై గద్గదంతో) ... అన్నయ్యా!! ...
పోష్టుమేన్:_టపా సార్!
ప్రకాశం:_సూర్యం:—(లోనికిపోయి చెరొకకవరు చింపుకుంటూ వస్తారు)
ప్రకాశం:_(లతతో) నీయడ్రస్ కూడా యిక్కడ కేయిచ్చావా? అదిగో! నీకొక రిజిస్టరీ లెటర్ వెళ్ళు!
లత:—(లోనికిపోయి కవరు చింపుకుంటూవస్తుంది.)
ప్రకాశం:_ప్రభుత్వపు పిలుపు నెలకు మూడువందల రూపాయిల జీతంతో అసిస్టెంటు వ్యవసాయ శాఖా డైరెక్టరుగా రమ్మంటున్నారు.
సూర్యం:_నాలెటరూ అదే నెలకు రెండువందల యాభై రూపాయల జీతంతో అసిస్టెంటు ఇంజనీరుగా రమ్మని.
లత:—నాకూ తందాన తానే _నెలకు రెండువందల యాభై రూపాయల జీతంతో అసిస్టెంటు డి. యం. ఓ గా రమ్మని
ప్రకాశం:_వెళ్దామా?
లత:—వెళ్తారా??

సీ॥ మొండి చాకిరి చేసి యెండి మనవారుండ
పూట కూటికి మీరు పోదురయ్యా
ఎండ వానల కోర్చి యుండ వారిని బాసి
భువన స్వర్గముగోరి_పోదురయ్యా
అమ్మా!! యనుచు కూటి కల్లాడు ప్రజలను
విడనాడి పదవికై నడతురయ్యా

స్వార్థలుబ్ధులకు పరమార్థ సేవలు చేయు
మనుపీనుగుల నెట్లు మరతురయ్య
గీ॥ జాతిరక్తంబు మీలోన చల్లబడెన?
మేటి పల్నాటి కన్నముని పోటుకత్తి
మొక్కవోలేదు–చేపట్టి ముక్తిగనుడు!
ఝాన్సి లక్ష్మిని నేనాడు జయము సూర్య॥

ప్రకాశం:సూర్యం:– (ఉద్రిక్తులై– త్రైన్‌కట్టి–శెల్యూట్ చేస్తూ) జై! హింద్!

లత:–(శెల్యూట్ చేస్తూ) జై! హింద్!... జాత్రైక్యాతా!

ప్రకాశం; సూర్యం:–జిందాబాద్!

పోష్టుమేన్:–టెలిగ్రాంసార్

ప్రకాశం:–(లోనికిపోయికవరుచింపుకుంటూవచ్చి)...సూర్యం ...చెల్లీ!! మనకోర్కె సాఫల్యమైంది...ఇదిగో! మన గ్రామాలమధ్య బంజరీ భూమి మాల–మాదిగల పేర మంజూరై–యేటిమొలికె త్రవ్వడానికి యిరవై యేళ్ళకు వాయిదాల ప్రకారం తీర్చుకునే షరతుమీద యాభైవేల రూపాయలు పాస్ జేసిన ప్రభుత్వార్డరు.

సూర్యం:– సామాను సర్దెయ్యండి. గ్రామానికి వస్తున్నామని స్వామీజీపేర టెలిగ్రాం యివ్వండి.

(జాతీయనాయకుల ఫొటోల చెంత కరిగి)

ప్రకాశం:_ సీ. కులతత్త్వములమాప కూలిపోయిన త్రాత!
దివినుండి యాశీర్వదించుమయ్య
సూర్యం:- స్వాతంత్ర్య రథమును సాగించు పండితా!
దీవించి పంపుమా దీక్షనలుప
లత:_ కష్ట జీవులమాత! కస్తూరి బాగాంధి!
సేవించ మాకు యాశీస్సు లిమ్మ
ప్రకాశం:_ ఆచార్య కృపలాని! ఆంధ్ర కేసరి! రంగ!
ఆశీర్వదించరే ఆత్మజులము
సూర్యం:—గీ॥ ఖండేర్కరా! జాతుల ఖండనంబు
ఖండనము సేయు దీవించు కరముజాపి
లత:_ విజయలక్ష్మి? హరిజన విజయమునకు
వేగ యాశీర్వదించుమా వేడుదాన॥
ప్రకాశం: సూర్యం: లత: పాట:_
ఓ! మాత! ఓ! భారతమాతా!
ప్రేమామృత సుధానేత
ప్రతిన యిదే ఓహో! మాత! ॥ఓ॥
నీ మనంపు చింతవీడి దీవెనలిమ్మా!
అమర యశము కూర్చెదమమ్మా!
ధైర్య స్థైర్య శౌర్య పటిమ
యుర్వీజాట గర్వముగా
తరలినాము ఓహో! మాత! ॥ఓ॥
(వెళ్తారు _ అవనిక జారుతుంది)

# న వ యు గ ము

[సాంఘిక నాటకము]

## ఐదో అంకం - మొదటి రంగము

(మీటింగు సన్నాహం - అలంకారాలు చేస్తూ, బల్లలు కుర్చీలు సర్దుతూ గంగన్న - మంగన్న - రంగన్న - వగైరా మాలలు)

రంగన్న:- మాఁవా! స్వాంగోరూ... పే... ద్ద పండగల్లే సేయిత్తుండాడు గందా?...యామ్మీటింగురా యిది?

మంగన్న:- పెకాశ బాబు-మాదిగంటే... లత... సూరయ్య ...యీళ్ళంతా వత్తుండారంట్రా!

రంగన్న:- యీళ్ళంతా వోళ్ళాళా? తెలవకుండా యేడుత్తావ్.

మంగన్న:- మన దానిగాడు- మాణిక్కి- పిల్లల్లే రంట్రా? ఆళ్లు గార్రా!

రంగన్న:- మాఁవా! ఆళ్ళింకా బతికుండారంట్రా?

గంగన్న:- బతికుంటమేంట్రా? జగ్గన్నాయాల! బియ్యాలు. యందేలు యిస్కూలుపైన సదివే సొత్తుంటేనూ.

స్వామీజీ:-(ప్రవేశించి)యేంగంగన్నా!పనులన్నీ పూర్తైనయ్యా?

గంగన్న :- ఆఁ! ఆఁ!... అయిపోయినియ్యండీ!

స్వామీజీ:—రైలువెళ్ళింది. వాళ్లు వస్తూనే వుంటారు. కబ్బన్న—దిబ్బన్న— స్టేషనుకు వెళ్ళారుగా? (ప్రక్కకు చూచి) అరుగో! వస్తూనే వున్నారు.

(ప్రకాశం:—సూర్యం:— లత:— కబ్బడు:—దిబ్బడు:— (ప్రవేశించి తాము తెచ్చిన పూలమాలలు స్వామీజీకి వేసి నమస్కరిస్తారు)

ప్రకాశం:—ఈ హరిజనాభ్యుదయ మహాసభకు శ్రీస్వామీజీని అధ్యక్షస్థానా న్నలంకరించ ప్రజల తరపున ప్రార్థిస్తున్నాం.

అందరూ:—స్వామీజీకి ... జై!

స్వామీజీ:—(అధ్యక్షపీఠా న్నలంకరించి) మన మధ్యనున్న యువకులు ఒకజాతీయగీతాన్ని పాడతారు.

ప్రకాశం, సూర్యం, లత:—పాట:—

లేవరా!! హరిజనా!

భావప్రపంచపు భాగ్యోదయమిదే
నేడే ఫలించిందోయ్! కూడిచరించండోయ్!॥ లేవరా॥

1 ఆరిన జ్యోతులు – మారిననీతులు
కోరి వెలిగితే – మారి మెరిగితే
దారిద్ర్యంబే– బాసిపోదా?
ప్రారబ్ధంబే – మాసిపోదా? ॥ లేవరా!॥

2 లే! లేవండోయ్!—లే! లేవండోయ్!
అరుణకాంతులవే – ఆవరించినయ్

కిరణకాంతిచే – పోరండోయ్!
తరుణకాంతిచే – చూరండోయ్! ॥లేవరా!॥
గడచిన పేజీ మఱువండోయ్
ముడిచిన పేజీ తెఱవండోయ్
గణ గణ గణ గణ – గంటా రావము
ధన ధన ధన ధన – ధర్మదుందుభి
మ్రోగించండోయ్! – సాగించండోయ్!॥

స్వామీజీ:–మహాజనులారా! మీ గ్రామస్తులై – మీతో అష్ట కష్టా లనుభవించి పన్నెండు సంవత్సరాల క్రితం మీమధ్య నుండి వెళ్లగొట్టబడిన దానయ్య మాణిక్యమ్మల బిడ్డలు ప్రకాశం – లతలే వీరిద్దరు.

దానయ్య : మాణిక్యం:–(ప్రవేశిస్తూ) బాబా! ... బాబా!!

ప్రకాశం : లత:–(నిర్ఘాంతపడి విని–గుర్తించి) బాబూ! ... అమ్మా!! (ఎదురువెళ్తారు ఒకరినొకరు కౌగలించుకుం టారు. ఆనంద పరవశత్వం చెందు తుంటారు)

స్వామీజీ:–ఆహా! ... నేడు పర్వదినం ... ఎన్నాళ్లక్రితమో చచ్చిపోయారని నిశ్చయించుకొన్న దానయ్య మాణిక్య మ్మలు నేడు మనమధ్యకు అకస్మాత్తుగా రావడం ఆశ్చర్యం –అద్భుతం. బిడ్డల్ని కన్నందుకు యిలాకష్టాలు అనుభవించి యైనా బిడ్డల్ని వుత్తీర్ణుల చేయించిన యీ తల్లిదండ్రులే భారతమాత బిడ్డలనిపించు కుంటారు. బోలో! దానయ్య

మాణిక్యమ్మలకు ... జై! (అందరూ జైనినాదాలు చేస్తారు.) సూర్యాస్తమయం కాబోతుంది మన కార్యక్రమాన్ని ప్రారంభిద్దాం. యీ యువకుడు యేటి అవతల మాదిగ పల్లెలోని మీలాంటి బీదకుటుంబీకుని బిడ్డ సూర్యం. వీరు ఒకరు ఇంజనీరు, ఒకరు వ్యవసాయ శాఖా డైరెక్టరు – ఒకరు యం. బి. బి. యస్ డాక్టరు, పరీక్షలు పాసై – తమకు గజిటెడ్ ఆఫీసరు పదవులు – బంగ్లాలు – గుమ్మస్తాలు – జమాన్లు – కార్లు – నెలకు మూడువందలు – రెండువందల యాభై రూపాయల జీతాలు – యిస్తామని ప్రభుత్వంవారు బతిమాలినా – అవన్నీ విడిచి తమ జాతీయులైన మీరు అష్టకష్టాలు అనుభవిస్తుండగా చూస్తూ సుఖంగా రాజభోగాలను అనుభవించడానికి యిష్టంలేక – మీకు జ్ఞానోదయాన్ని నెలిపి – జీవనోపాయముల గలిపి – మిమ్ముద్ధరించడానికై మీమధ్యకు వచ్చారు. అట్టి వుదారులైన వీరికి మీరు కృతజ్ఞులై యున్ననాడు – విద్యాధికులైన వారందరూ వీరివలే జాత్యోద్ధరణకు – జాత్యైక్యతకు – తమరక్త మాంసాలొడ్డిన నాడు – ప్రజలందరూ విద్యావంతులై – ఐక్యభావాలతో – ఐక్యకంఠాలతో – దేశమాతను సేవించిననాడు మనకు స్వాతంత్ర సౌఖ్యం చేకూరిందని గర్వించగలం.

బోలో! స్వతంత్ర భారత్‌కీ... జై!

అందరూ:—(జై జై నినాదాలు చేస్తారు)

స్వామీజీ:—ఇప్పుడు ఇంజనీరు సూర్యంగారు మాట్లాడుతారు.

సూర్యం:—మహాజనులారా! యీనాడు మన యీ మహాసభకు అధ్యక్షత వహించిన యీ మహానీయుని అనుగ్రహం వల్లనే మాకు సకల విద్యాపారంగతప్రాప్తి లభ్యమైంది. పెంటకుప్పలపై దొర్లాడుతున్న మన మాల - మాదిగ పల్లెలనుండి ఐదువందలమందిని వ్రాయను - చదువను నేర్చిన వారిగా సిద్ధపరచి - నాగరికులుగా మార్చిన యీ దానశీలుని మనవారందరి తరఫునా వందనాలర్పిస్తున్నాను.

మీ కందరికీ ఒక్క ముఖ్యవిషయాన్ని చెప్పాలని యీ సమావేశాన్ని యేర్పాటు చేశాం. మేము చదువుకుంటున్న రోజుల్లో మా తల్లి దండ్రులైన మీయందరి కష్టాల్ని తలంచని రోజు - మిమ్ములను గురించి దుఃఖచని ప్రొద్దు - ఒక్కటి కూడామాకు జరగలేదు. మీసుఖ జీవనానికై మా జీవితాల నంకితంచేయ కట్టుకున్నా కంకణాలివిగో! కళకళలాడుతూ మెరుస్తూనే వున్నయ్. ఇంతటి మహాపీరులు వస్తూ తెచ్చిందేం టయ్యా? అని మీరడుగవచ్చు. తెచ్చాం. మహాఘన కార్యాన్నే సాధించుకొచ్చాం. వినండి. మన మాల-మాదిగ పల్లెల మధ్యనున్న యేటిమెలికను-తిన్నగా త్రవ్వడానికి అర్జీ పెట్టాం. అది త్రవ్వినందున ఐదువందల యకరాల భూమిసాగులోకి వస్తుంది. ఆ భూమిని మనరెండు వందలయాభై

కుటుంబాలకున్నా కుటుంబం ఒకటికి రెండెకరాలు చొప్పున శ్రీ గవర్నమెంటువారు మనకు మంజూరు చేశారు.

స్వామీజీ :— జాతీయ ప్రభుత్వానికీ... జై !

సూర్యం :— మన మందరమూ ఆ ఏటిని త్రవ్వాలి కూటికి లేని మనం అంతపని చెయ్యలేమని ప్రభుత్వానికి మనవి చేశాం. ఇరవై సంవత్సరాలు వాయిదాల ప్రకారం తీర్చు కునే షరతుమీద యాభై వేల రూపాయలు మనకు అప్పు యిచ్చారు.

స్వామీజీ :— జాతీయ ప్రభుత్వానికీ... జై !

సూర్యం :—ఆ సొమ్ముతో మనం భుక్తిని గడుపుకుంటూ యీ సంవత్సరమే ఆ భూమిని సాగులోనికి తీసుకొని రావాలి. యీరోజే పని ప్రారంభించాలి. మనమందరమూ నడుములు బిగించాలి—ఐక్యంతో కార్యరంగన్లోకి దూకాలి. మన ఐక్య విధ్వంసకులవల్లగాని—అసూయా వేషులవల్లగాని— ఆపదలు సంభవిస్తాయని మీరేమీ భయపడకూడదు.

సీ. ఆంధ్రరాష్ట్రపు కోట ఆకాశమును దాక
ఆంధ్రకేసరి 'టోపి, ఆడుచుండ
తెలుగుదేశపునాక తెరలెత్తి పట్టాభి
ప్రతిభ 'చుక్కాను' చేపట్టి నిల్వ
రైతు కూలీ ప్రజారాజ్య 'శకటము'లాగ
ఆంధ్ర రంగా గిరియు అఱ్ఱుసాచ

హరిజనోన్నతి బాట కడ్డమౌ అడవిని
నఱుకగా సాగిప్పు నడుముగట్టి
గీ॥ కీర్తి గోపుర స్తంభమై మూర్తి, నిల్వ
ఆలసించెదవేలనోయ్ ! హరిజనుండ !
రమ్మ ! దూకుము ! కార్యరంగమ్ములోన
విజయమో ? వీరస్వర్గమో ? వెదకుమయ్య !

స్వామీజీ :— ఇప్పుడు యం. బి. బి. యస్. డాక్టరస్ శ్రీమతి లతాదేవిగారు మాట్లాడుతారు.

లత :— తల్లి తండ్రులారా ! శ్రీమతి లతాదేవి గారని గౌరవ పదాల్తో పిలిపించుకొనుట నాకిష్టంలేదు. నేటి నుండి మీరందరూ నన్ను– లత, అని పిలవండి– లత, అంటే ఆకులు– పువ్వులు.వికసించిన తీగ–ఆతీగెవలే మీకు అల్లుకు పోవాలని నాకోర్కె– తీగ వల్ల చెట్టుకు అందముంది. చెట్టును చుట్టుకున్నా తీగెకూ అందముంది. అట్లే మీవల్ల నాకుశక్తి– నావల్ల మీకుశక్తికలగాలి. మీలోలేనిశక్తి యేముందో వెతకండి. అహోరాత్రాలూ కష్టపడతారు–అందరికీ తినిపిస్తారు వారిచేతనే తిట్లుతింటారు అందరికీ వుపాయాలు చెప్పతారు– వారిచేతనే చెప్పుదెబ్బలు తింటారు. అందరికన్నా ఆరోగ్య ప్రదేశాల్లో వుంటారు – అంటువ్యాధుల్తో అకాలన్లోనే చస్తారు. వీటన్నిటకీ కారణం అవిద్య – అనారోగ్యం– చదువులేని మొద్దు – కదలలేనిమొద్దు అన్నట్లు మిమ్మనూ

యెద్దుల బాదినట్లుబాది - మీచేత పాటుపడించుకుని - మీకువరిగడైనా వేయక - గాటిని కట్టేస్తున్నారు. మీరు నాగరికులై - జీవన సౌలభ్యాలు కావాలంటే-ముందుగా విద్యనేర్వాలి- మేమందరమూ - అన్నివేళ్లలోనూ-యువకులకు - వృద్ధులకు - స్త్రీలకు - పిల్లలకు - వుచితంగా విద్యనేర్ప సిద్ధంగా వుంటాం మీకే సమయాల్లో తీరితే - ఆసమయంలోనే వచ్చి విద్యనేర్చుకోండి. ఇప్పుడు మనపల్లెలందు కలరావ్యాధి వ్యాపించి వుందంటే-మీయిళ్ళమధ్య మురుగునీరు - పెంటప్రోగులు - కుళ్ళువస్తువులు - శిథిల జంతువులు - యీగలు - దోమలు - మొదలైనవే కారణాలు. వాటిన్నివారించే విధానాన్ని అమలు జరపడానికి వాలంటీర్ల దళాల్ని తయారుచేస్తాం. మీరందరూ ఆరోగ్య పద్ధతుల నవలంభించండి - విద్యావంతులవండి - నిరంకుశుల బారినుండి తొలగండి.

ఉ. పాపులు నీచమానవులు బానిస లంచును బాధపెట్టి యీ
తాపుల జీవనంబుననె తాండవమాడుడటంచు నెట్టినన్
ఓపికతోడ హింసలను యోర్చిరి శుభ్రము లేమిచేత నో
తాపసులార! మేల్కొనుడి! ధన్యతగాంచుడి!విద్య నేర్చియున్.

స్వామీజీ:- శ్రీయుత ప్రకాశరావుగారు మాట్లాడుతారు.

ప్రకాశం:- ఈ హరిజనాభ్యుదయ మహాసభకు అధ్యక్షులైన శ్రీ స్వామీజీకి వారుమనకుచేసిన అపారసేవకు-జోహారు

లర్పిస్తున్నాను "హరిజనులు" అని మహాత్మాగాంధీచే నామకరణం చేయబడిన మనవారు పూర్వము "ఆదిమ నివాసులు" అని పిలువబడుచు – సకలవైభవములచే తులతూగిన అఖండ భారతదేశాన్ని అవిఘ్నంగా పాలించిన యోధాగ్రేసరులే. తదుపరి మధ్యాసియానివాసులు మనవారి పంచజేరి – మనవారి నెత్తు మెతుకులుతిని – తిన్న యింటి వాసాలు లెక్కించినట్లు మనలో మనకు చీలికలు పెట్టి – విరోధాలు – విభేదాలు – కల్పించి – చీలదీసి – జయించి – దూరంగా తరిమివేశారు. మళ్ళీతలెత్తకుండేందుకు దూరంగా గుడిశెలు వేసుకొమ్మని – గ్రామ వీధులలోనికి రానీయక – బావుల చెఱువుల నీళ్లు వాడనీయక – హింసించారు. పొలాలలో పనులు మాత్రముచేయించుకుంటూ – ఆభూముల విక్రయంతోపాటు పనివారిని కూడా విక్రయించే టంతటి బానిసకులాలుగా మార్చారు. తినుబండారాల కొనుక్కొనుటకైనా గ్రామాలలోనికి రాకుండా శాసించారు. ఆసామి పొలన్లోకి వచ్చుట చూచి కనుచూపు దూరన్లో వుండగానే ఆ పొలాన్ని విడిచి – యే యడివిలోనికో – యే చెట్టు పుట్ట చాటుకో పారిపోయి – కంటి కగుపడకుండా దాకుని కీచుమనగొంతుకతో "బువ్వపడేయండిదొరా !!!" అని కేకవెయ్యాలి. అప్పుడా యాసామి కొంత అన్నాని క్రిందపడేసి వెళ్తే

ఆ యాహారాన్ని కాకులు - కుక్కలు తింటున్నా - ఆయన కంటికగు పడునంతవరకూ ఆ యాహార పదార్థాలవద్దకు వెళ్లరాదు. ఆ కుక్కల - కాకుల - యెంగిలి తిండితినేతిని - వాకిరి చాకిరి చేసేవారిగా ఆజ్ఞాపించారు. వారు హింసించిన విధానమంతా చెప్పుకోవాలంటే సంవత్సరానికైనా తరగదు. వారు పెట్టిన బాధలు పుస్తకాలుగా వ్రాయాలంటే సహస్ర పర్వ హింసాభారత మౌతుంది. హృదయాలు తరుక్కుపోయే బాధలు పెట్టారు. గుండెలు బ్రద్దలయ్యే ఘాతుక చర్యలు చేశారు. అట్టి ప్రత్యక్ష నరకబాధలు - మానవాతీత దృశ్యాలు చూచి బాబూజీ వాపోయాడు. అధోగతి పాలైయున్న మనకు హరిజన నామ కరణం చేసి - తానూ హరిజనుడైనాడు. మహాత్ముని ఆశయాల ననుసరించిన దేశనాయకుల నిరంతర కృషివల్ల నేటికి మనము కొంతవరకైనా మార్పులోకి రాగలిగాము. ఇదిచాలదు. మేమూ ప్రపంచన్లో వ్యక్తులమే నని నిరూపించాలి మెజార్టీ ప్రజానీకానికి అసహ్యంగా కన్పించే-మన ఆచార - వ్యవహార - ఆహారవిహారాల్లో మార్పుకలగాలి- నానాజాతి నిర్మూలనానికి ఐక్య - అనురాగ - ఆయుధాల ధరించి - విఘ్నకారుల జయించి - ఒకే ఒక భారతజాతిని నిర్మించాలి. ఒక్కజాతికిచెంది-ఒక్క చోట నివాసముండి - ఒకరికొకరు అంటూ - సంటులు

కలిగిన మన వారంతా యేకంగావాలి. మనలో ముక్క చీలికలు కల్పించి - విభేదాలు పొడసూపించి - విరోధాలు రేకెత్తించి - మనలను ఓడించి పాలించిన కుద్రోహులు - యీ నానా కులాలను మనలో మనకు కల్పించి - మన మంతా యేకోదరుల మని గ్రహించ వీలుగాని స్థితిలో వుంచారు. వాళ్లు నిర్ణయించిన జాతులే యీ మాల-మాదిగ - పల్లరి - పరయారి - చమార్ - డోమ్ - మాంగ్ - ఢేడ్ - మహార్ - భంగీ - మొదలగు వేలాది తెగలు. ఒకరి నొకరు కలుసుకోని వీలుగా సంతటి అగ్నిపర్వతాన్ని మన మధ్య కల్పించారు. ముందు యీ నానా తెగలుగా వున్నా హరిజను లందరూ ఒక్క తల్లి బిడ్డలమేనని ప్రపంచానికి వెల్లడి చెయ్యాలి. నానా జాతి నిర్మాతలపై యుద్ధాన్ని ప్రకటించాలి.

సీ. జయపు నాదులమెత్తి జాతిభేదపు తొత్తు
జగతి నరకాసురుల జంపకున్న
యేక మానవజాతి యేకోదరఖ్యాతి
యేక భారత నీతి లేకయున్న
కుల తత్వ మహమ్మారి కుదురు గద్దెలతోడ
ప్రళయ బాంబున ధ్వంస పఱచకున్న
మాల మాదిగ గోల మాపి యుజ్వలలీల
మాలలో పూలమై మసలకున్న

రాష్ట్రకేంద్రాల మంత్రులై రగులనేమి?
భారతధ్యక్ష పదవినే బడయనేమి?
లేదు గృహమున సౌఖ్యము లేశమైన
ఐక్యజెండాను పైకెత్తు! హరిజనుండ! ॥

సంగన్న:—(ఉద్రేకంతో లేచి) మీ సభోరందరికీ నా సెబాస్! నాను సమవ్రాని సరవమొద్దురాయె. సెప్పేదాంటో తప్పుంటే శెమ్యిచ్చుకో వాలిగాని - యెహె హె హె హె హెహేని నవ్రుతా రేంట్రా? యెదవనాయాళ్ళారా?—యినండి! యినండి!... కల్లుమూతలుబడిపోయి—గుడ్డినిద్దరోతుండా మన మాల మాదిగోళ్లని నిద్దర్లోనుంచి లెగ్గొట్టాడ్రా మన పెకాశ బాబు, నిజంగా ఆల్లు—మువ్వ్రూ ఒకపారుగున కాపురవ్వుంటాంవ్—ఒకబంటాలో పన్జేత్తావ్—ఒకే సోటే కల్పి మెల్చి తింటాంవ్—ఒకల్లొకల్లు అంటు కుంటాంవ్—యెప్పుడో బేవారు నాయాలు మినకీ - మనకీ యిరోదాలు పెట్టాలని యిట్టా జేశాడుగాని - మనంవంతా ఒకటే నని నాకు నికార్సుగా తేలిపోయిందిరా మీ మనసుల్లో యాం వుందోగాని నా మనసూ—మీమనసూ కల్పి నట్టుంటే—మనస్వాంగారి పేర జై గొట్టండ్రా సూద్దాంవ్

(అందరూ స్వామీజీ పేర జై నినాదాలు చేస్తారు)

సంగన్న:—బలే పసందైనోళ్ళాయిారు. మన మాలమాదిగోళ్ళి ముందుగాళ్ళకి రానిచ్చినకీర్తి ఆళిదువానుకూడురాజోదుకే

దక్కింది — మాల-మాది గోళ్లు యే కమైనకీ త్రిమనపల్లిలికే దక్కాలి, ఓరేకబ్బా! నువ్వా-దిబ్బడు యింటికోసోళ్లు నూకలు పోసుజెయ్యండ్రా! అభ్యా-మనవ్వూ కల్పి బంతి బోజనా లేద్దాంవ్ ... యాం వుండో: సూరయ్యా బాబూ! దా న్తసాగొయ్యా యాంవన్నాగానీ ముందుగా రంగఁవ్ లోకి నేనే దూకుత్తా. మాదిగోళ్ళపిల్లోడు-మా... ంచి గిల క్కాయంటోణ్ని నూడు! నాకూతురు కోట్నిచ్చి పెళ్ళి జేత్తా.

(అందరుగంగన్నకు జై జై నినాదాలుచేస్తూగంగన్నను పై కెత్తుకొనివెళ్తారు అందరికన్నా వెనుక ప్రకాశంవెళ్తూంటాడు)

దాదా:—(ప్రవేశించి సౌజ్ఞచే ప్రకాశ్ ను వెనుకకుమరలిస్తాడు)

శాంత:—(అంతవరకూ జరిగిని దంతా చాటునుండిచూస్తూ వుండి ఆనందంతో ప్రవేశించి ప్రకాశ్ మెడలో పూల మాలను వేస్తుంది)

ప్రకాశం:—(నిర్ఘాంతపడిచూచి-గుర్తించి-) శాంతమ్మా!! ... (మోకరించి నమస్కరించి — కలాన్ని కళ్లకద్దుకుంటూ — నాడు తాను సమర్పించలేని కానుకయగు కుంకమ భరిణను తీసి-శాంతకుతిలకము దిద్ది — కానుకను అర్పిస్తాడు)

ప్రకాశం :—

మ. కరుణాలోల ! విశాలలీల భువి మా కష్టాల బోద్రోలగా
పరమామ్నాయసబేల!శాంతమ!విశోభాజ్వాల!యీలీల మా

మ్మరయంగా నవతార బాల విలసో!మాలా!నవీనాంధ్రజా!
చరఖాశాల! యనాదర ప్రజలపై జాలీ! నమస్కారమో!

శాంత :—

ఉ. పావనమైన నోములను భక్తి దలిర్పగ నోచి నోచి నా
భావపు సూత్ర యజ్ఞమున బంధనజేయగ నెంచి యెంచి నే
జీవము లుంచి తివ్విధిని చీకటిబాపు కుశాగ్రబుద్ధివై
పావని దేశమాత నిల భాగ్యవిశాలనుచేయు ధీనిధీ!

గగ్గయ్య :—(ప్రవేశిస్తూ) యెవడేవాడూ? (కొడ్తూ) వాడితో
యేంటీ రహస్యాలు! యెందుకొచ్చా విక్కడికి!... యిల్లు
కదుల్తావా? ......కదుల్తావా?

ప్రకాశం:—(గగ్గయ్యనువారిస్తూ) వారేమీ తప్పుచేయందే
యెందుకండీ! అలా చంపేస్తారు?

గగ్గయ్య:—నీవెవడవురా చెప్పడానికి?...వాలగాడిదికొడక!
పడుచు పడుచు ఆడాళ్ళతో ప్రైవేటుగా సంభాషించే
డానికి- అవతారమెత్తొచ్చావా గోపాలకృష్ణుడివి??

శా. ఓరీ! నీచకులాధ మోరి ఖలుడా! యోరీశఠా! దుర్మతీ!
ఓరీ ద్రోహీ! మదాంధ! మాఘనతలన్ యోర్వంగ లేకవిధిన్
నారీ లోలుడవయ్యె మా దగు ఘరానా దీయగాజాతునే
శూరాగ్రేసరునోడు నేనిగనుమాచూపింతుశౌర్యోన్నతుల్.

(శాంతను రెక్కబట్టి యీడ్చుకొనివెళ్తాడు- తెరవాల్తుంది)

# రెండోరంగం

(యేకాంతంగా గదిలో బంధింపబడిన శాంత)

పాట

శాంత :—స్వాతంత్రావనిన్ – సౌఖ్యమే – శూన్యమాహా॥
మాతా! భారత నాతికే ఖ్యాతి లేదా? ॥స్వా॥
జాతికే గుందినామే – నీతికె చెందినామే
సుతల్ – దుర్వ్రతల్ పో గతుల్ మాతవీవే ॥స్వా॥

సీ. స్త్రీజాతినోదార్చి చివికిపోయిన మాత!
కస్తూరిబా గాంధి! కరుణ లేద?
వీరభారతనారి విలపించు చుండెరా!
వీరేశలింగమా! వేగరావ?
దక్షిణాఫ్రిక స్మట్సు దక్ష యజ్ఞము దన్ని
విజయ సాధిత దీక్షి! విజయలక్ష్మి!
అమెరికాలో భార త్రైక్య జెండా రోహి!
నవ వతంసమ! అరుణ అసఫాలి!
యింట స్వాతంత్ర్యమును బాసి యేడ్చుచుండ
యెక్కడో పోరగానేల? ప్రక్కనున్న
వీరనారుల సౌఖ్యమే కోరరేల?
పోరి సాధింపరే! భరతనారి స్వేచ్ఛ॥

దాదా:—(లోపలనుండి) శాంతమ్మాఘూర్! శాంతమ్మాఘూర్ !!
ఖోంపాముస్గి పోయిందీ హాండీ! శాంతమ్మాఘూర్!

... మీాకీ నానాఫూర్ – ధిబ్బడీక్ డిబ్బడీక్ పడీ
యేల రూపాయిల్ హాళాపెట్టి – పెకాశ్ బాబీక్ పంపీ
హేస్త్రాసీక్ పంపార్ హాండీ ! శాంతమ్మఘూర్ !

శాంత:– అయ్యో ! ... యిప్పుడేది గత్యంతరం !... దాదా !
నీవు త్వరగావెళ్లు ! స్వామీజీకీసమాచారం సత్వరంచెప్పు
... వెళ్లుబాబూ ! త్వరగావెళ్లు ! నీకు నమస్కారంచేస్తా
త్వరగావెళ్లి రక్షించు ... ఆఁ ... దాదా ... ! ...
మాబావను నేనురమ్మన్నాననిచెప్పు ! ...

భాను:– (లోపలనుండి) ఒహ్హో ! ఓ ! హో ! హో ! మరదలా

శాంత:– బావా !!

భాను:– నన్ను పెళ్లాడనన్నావే...ఆఁ ... ఆ చీకటి గదిలోనే
పడి చావు ! ...

శాంత:– బావా ! సిగ్గువల్ల అట్లన్నాగాని...నిన్నుగాక ఇంకె
వర్ని పెళ్లాడతాను ? ... బావా ! బైట యెవరైన
వున్నారా ?

భాను:– యెవ్వరూలేరు ... యేంమొకు ?

శాంత:– ఒక్కమాట చెప్తారా బావా !

భాను:– నీ వక్కడ – నే నిక్కడ – మన మాటగలిసేదెక్కడ
నన్ననా నన నన్ననా॥

శాంత:– మానాన్నగారి మంచం తలగడక్రింద తాళంచెవు
లుంటయ్ గాని – తెచ్చి – తాళంతీసి – లోనికిరా !

హాను:— ఓ!! రెండు బర్మా షెకెండ్లలో వెళ్ళి-చైనా ద్యాన్సుతో తెస్తానుండు.

(ప్రవేశిస్తూ) పాట

నీకూ నీవారు లేరు — నాకూ నావారు లేరు
ఆకుచాటున ఆడుకుందము రావె॥ నాముద్దు శాంత॥
చీకటింట్లో — నన్న నన నన ననా॥

శాంత:—

నేను నీదాననోయి — నన్నేలగారావోయి,
ఆనంద స్వర్గసీమ — హనుమంతురావు ప్రేమ॥

హాను:—

ఆహా! యేమిా? నాభాగ్యం —
దేవి కరుణించెన్!
నేటికి నా — జన్మతరియించెన్॥
(శాంతను కౌగలించుకో బోతాడు)

శాంత:—(వారించి) ఆగు బావా!!

హాను:—అదుగో!... మళ్ళీ ఆ జబ్బొచ్చిందీ?

శాంత:—జబ్బుగాదు బావా! యీాదృశ్యాన్ని యెవరైనా చూస్తే - శ్రీ శ్రీ శ్రీ హనుమంతురావుగారి భార్య — ఆ మూడుముళ్ళూ పడకముందే — ముద్దులాడిందీ — అని నిన్ను పరిహాసం చెయ్యరూ?

హాను:—ఆఁ... అవును. ... ... మదీయ సతీమణి సీత—సావిత్రి—

అనసూయ అహల్యలకంటే_మహా పతివ్రతయని పేర్గాంచ వలెను.

శాంత:—ఆఁ! బావా! నాకొకగొప్ప ఆలోచన స్ఫురించింది.

హాను:_యేమాలోచనః? కథకు అడ్డం తిరిగేదా?

శాంత:_ఊఁ... హూఁ... కాం_గ్రే_సు_పె_ళ్లి_పూలమాలలు వేసుకుంటే - పెళ్లైనట్టే లెక్క. అలామాలల్తో మనం వివాహమాడి - ...తర్వాత... సరేనా?...?

హాను:— ఆఁ! ...బలే మరదలు _ బలేమరదలు _
మామరదలు మంచిది _ నాకు
మరమరాలు పెడతది!!

శాంత:_చి ఛీ!... యేంగోల!

హాను:— ... ...మరి... దండలెలా!...?...

శాంత:_ఓ!... యెంతసేపు?... ఒక్క_క్షణన్లో తయారుచేస్తా! మనతోటలోరకరకాల పూలున్నయ్‌గా_కోసుకొస్తానుండు ...ఆఁ... బావా! చూచినాళ్లు శాంత లోపలే వుందను కోడానికి మామూలుగా బైట బీగంవేసివెళ్తా. యీ గది వైపెవరైనా వచ్చినట్లు చప్పుడైతే_నే నేడ్చినట్లు యేడుస్తూ వుండు।

హాను:_ఓ! దుమ్మురేగే లాగేడుస్తా.

శాంత:_యేదీ?... యెలాయేడుస్తావో...

హాను:_సకిలించి_గొంతుసవరించుకొని) ఓయి దేవుడో!! ... దేవుడా!! ... ఓలి మాయమ్మో!! ... మాయమ్మో!! ...

శాంత:_అమ్మ ... యిప్పటికి బ్రతికాము. (నిష్క్రమిస్తుంది)

(తెరవాల్తుంది.)

మూడో రంగం

(గంగన్న_మంగన్న_రంగన్న వగైరామాలలు పోలేరమ్మగుడిముందు జాతర జేసేసన్నాహాల్తో_గొఱ్ఱెలు_కోళ్లు_పూజచేసి వేపాకు కట్టిన ఘటం_కఱ్ఱచివర చెంబుకట్టి వేపాకుచుట్టిన పోతురాజు చిహ్నం తప్పెటవాయిద్యాలు మొదలగు ఆర్భాటాలతో)

1 పోలేరమ్మో! నిన్ను పూజింతుం వే_॥తల్లి॥
పోతురాజుదేవుడికి _ పొలి యేటలో॥

2 అంకాలమ్మ! పొలి _ ఆరగించవే_
మాంకాళమ్మో! తల్లి_మమ్మేలుకో!॥

గంగన్న:_వెయ్యిరూపులు గలతల్లీ! యేకినెత్తురిదుగో!
అష్టచేతులు గలదానా! ఆరగించవమ్మ!
నెత్తురుకూడుతినుదానా! నెత్తురుబట్టలదానా!
పుట్టిశెలగపొలికూడు _ పోయింతురావే!
నూటొక్క_కన్నులతల్లి! పోటుబల్లెముదానా!
యాటపుఱ్ఱెలదండ _ లేయింతురావే!

నెత్తురు తాగే తల్లి! నెత్తినిక్కేతున్న తల్లి!
యెత్తిన కత్తి దిగకుండా యేటింతునేటు"

ఓం! నమో! భగవతీ! భద్రకాళీ! కాత్యాయనీ! కామరూపిణీ! ఆదిమహాశక్తీ! ఉద్దండకాళీ! ఉగ్రమూర్తినీ! నమో! నమో!

అందరూ:— వలా! వలా! వలా! వలా!...

ప్రకాశం:— (పరుగిడివచ్చి) ఆగండయ్యా! ఆగండి!...నిండు ఆమాయికాన్ని ప్రదర్శిస్తున్నా యీమన ఆప్తబంధువుల్ని బలి యిమ్మని బాధించిందా యీ దేవత? కేవలం అనాచారమైన యీజాతర పేరుతో నోరులేని మనబిడ్డల్ని చంపుకోడానికి మీకు జాలిలేదా?

ఉ॥ భూతములంచు నీ విధిని భక్తిని గూర్చెదు బంధుకోటికీ
ఘాతుక చర్యలన్ సలుప గౌరవమా? ఘనమా? విశాలమా
పాతకమంచు నెంచి నిజ భక్తిని వ్రూంజలసేయరయ్యా! మీ
నీతినిచాటి నిత్యమగు నిర్మలముక్తిని బొందగోర రే॥

గంగన్న:— బాబూ! తవురిమాటకడ్డవొచ్చా... మరీ... ఇయ్యన్నీ అనాశారా లంటుండారుగందా — గాందీగోరి బూడిదీ — గంగలో గలిపితే ఆరికి ముగితొస్తుద్దా? ఆపనికంటే — అమ్మోరు జాతరతక్కువుదా?

ప్రకాశం:— చక్కని ప్రశ్ననడిగావు ఇక్కడే చాలమంది పొరబడుతున్నారు. గాంధీగారి ముక్తికై గంగాయమునాది

నదులలో వారి చితా భస్మాన్ని చేర్చలేదు. బానెడు బురద నీళ్ళను ఆవగింజంతచిల్లగింజగంధం తేట నీళ్లుగామార్చినట్లు- బిందెడుపాలనుచిన్నతోడు చుక్క-పెరుగుగా మార్చినట్లు- బాబూజీ పవిత్ర దేహశేషాన్ని భారత గడ్డనంతటా మిళితం చేసిన దేశపవిత్రతగలిగి - సస్యశ్యామలమై - శోభావంత మౌతుందనే భక్తి నమ్మకాలచేత-నదీజలములందా చితా భస్మాన్ని మిళితంచేశారు. ఆ పవిత్రాశయనాకీ...

కబ్బడు: దిబ్బడు:- (వెనుకనుండివచ్చి ప్రకాశ్ తలపై బలంగా కొడ్తారు)

ప్రకాశం:- హా! బాబూజీ !! (పడిపోతాడు)

(గంగన్న - మంగన్న - రంగన్న వగైరాలు కబ్బణ్ని- దిబ్బణ్ని - పట్టుకొని రెక్కలువిరిచి కట్టివేస్తుంటారు)

శాంత:- (పరుగిడివచ్చి పడియున్న ప్రకాశ్ ను ఒడిలోచేర్చుకుని కట్లు కడుతూ)

నిజమగు భారతీయుని సునేతను నిర్మలచిత్తు నీ ఘనున్
నిజకుల సౌఖ్యగాము నిటునేరములేకనె జంపనెంచిరే
భుజబలమా ? మదంబ ? నిజపూరుష జాతియ? సిగ్గులేదయా
సుజనుని జావమోద మిముశూరులటంచని మెచ్చుకొందురే

స్వామీజీ : సూర్యం : లత:- (ఆతురతతో పరుగిడివచ్చి - ప్రకాశ్ నుచూచి దుఃఖపడుతుంటారు లత చికిత్స చేస్తూంటుంది)

స్వామీజీ:—(కబ్బలి - దిబ్బలిచూచి) మీ కార్యాన్ని మీరు ముగించారా ? తన సర్వస్వాన్నీ మీకొరకు త్యాగం చేసిన యీ శాంతిమాతను చంపయత్నించిన మీది హృదయమా : చట్రాతి చదరమా !

కబ్బడు:— స్వామీ ! అపరాములేవి ఆ గంగయ్యగోరె మాయ మాటల్నమ్మి తాగి - దేవుడంటి బాబుగోర్ని కొట్టేశాం మమ్మల్నేవిజేసినా పాపంతీరదు. ఆ పోలేరమ్మకి బలి నరికెయ్యండి

దిబ్బడు:— నరికెయ్యండి స్వామీ! నరికెయ్యండి ! మాయంటి కులద్రోయుల్ని పొల్నరికితే - తాగుబోతోళ్ళ కందరికీ సిగ్గొస్తద్ది నరికెయ్యండి.

స్వామీజీ:— పొలినరుకుట... జంతుబలి... జాతర ... యెంత అమానుషం ? యెంతఅన్యాయం ? యెంత అసహ్యం ? మీ భార్యా బిడ్డల్ని బతికించే యీ పశువుల్ని చంపే కన్న - యెవరికీ వుపకరించని నన్నుచంపి ఈ దేవత ఆకలి తీర్చండి (దేవత కెదురుగావంగి) ఊఁ... చంపండి !!

గంగయ్య :—(పరుగిడివచ్చి) అవును... చంపాల్సింది నిన్నే (స్వామీజీని కత్తితో పొడుస్తాడు స్వామీజీ గాయాన్ని నొక్కిపట్టి తూల్తూవుంటాడు - గంగయ్యను మాలలు బంధిస్తారు అందరూస్వామీజీని కౌగలించుకొనియేడుస్తూంటారు

స్వామీజీ :— గగ్గయ్య... గారిని... యెవరూ ... యేమీ...
అనవద్దు... పోలీస్ స్టేషన్‌లో... అప్పగించండి... హా :...

గంగన్న :— (బంధించిన గగ్గయ్యను తీసుకెళ్తాడు)

శాంత :— బాబూ! నాతండ్రిచేసిన రాక్షస కృత్యానికి నన్ను
క్షమించండి. ఆ కర్కశహృదయుడు—ఆ ద్రోహి తండ్రి
కాడు... యీ క్షణం నుండీ మీరేనాతండ్రి అనుగ్ర
హించండి.

స్వామీజీ :— శాంతమ్మా !... కుమారీ !... ఆగ్రహానికి ...
తావు... యివ్వొద్దు... శాంతి... శాంతి...

ప్రకాశం :— (స్ఫురహాగలిగి విషయాన్ని గ్రహించి) బాబూజీ !!
మమ్మల్ని దిక్కులేని పక్షుల్లాగా చేస్తావా? (కౌగలించుకొని
యేడుస్తుంటాడు)

స్వామీజీ :— నాయనా!... ప్రకాశ్! విచారించొద్దు... అంతా
... మిగిలిపోయింది ... నాది... ఒక్క ... కోర్కె ...
మిగిలి పోయింది... అది... మీ... వివాహం... హా !

శాంత :— బాబూ !... ప్రకాశ్‌కు—నాకూ... మీ చేతుల్తో...

స్వామీజీ :— ఆహా !... ... నాయనా !... ప్రకాశ్ !... యిటు
... రా!...

ప్రకాశం :— (లతాసూర్యంల చేతులుకలిపి స్వామీజీయెదుట
మోకరింపజేసి—తానూమోకరిస్తాడు.)

శాంత :—(ప్రకాశ్ ప్రక్కనమోకరిస్తుంది)

స్వామీజీ :— (దండలు తెప్పించి లతాసూర్యాలకు-శాంతా ప్రకాశ్ లకు వివాహం చేసి చింకు తున్నాతనరక్తాన్ని వారికి తిలకం దిద్ది పడిపోయి మరణిస్తాడు) (అందరూఒక్క-సారి గొల్లునయేడుస్తారు.)

అందరు :— పాట :—

బాసి పోతివా ? బాబుజీ ! మమ్ముల ॥బా॥

1. యేపారి మాకింక యెవరింక మాదిక్కు-
పాదాల పూజించే భాగ్యమే నశి యించె ॥బా॥

2 దిక్కెవ్వరో ? మాకు దీనజనబాంధవా !
ఒక్క-మాటాడకయే - ఒరిగావ ? నేలపై ॥బా॥

(తెరవాల్తుంది)

మంగళం మహాత్.



# శ్రీ వన్నెకూటి బాలసుందరంగారి

ప్రచురిత రచనలు



| | |
|---|---|
| జ్ఞానసుందరి (చారిత్రక నాటకము) | వెల రూ. 1-0-0 |
| నవయుగము (సాంఘికనాటకము) | ,, 1-4-0 |

ప్రతులు దొరకు స్థలములు :—

వెంకట్రామా అండ్ కో., } విజయవాడ.
సరస్వతీ బుక్ డిపో, }

రామా అండ్ కో., } ఏలూరు.
గోపాల్ అండ్ కో., }

సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

హిగ్గిన్ బాదమ్సువారి అన్ని రైల్వే పుస్తకాల షాపులలోను,
ఇతర ముఖ్యమైన పుస్తకాల షాపులలోను.



**శ్రీ వన్నెకూటి బాలసుందరం,**

**వెంట్రప్రగడ P. O.**

గుడివాడ తా॥ కృష్ణాజిల్లా.

పట్టాభిరామా ప్రెస్, ఏలూరు.